

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

వెల 4 అణాలు ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY 12-7-19

# రాష్ట్రంలో భారత ఆహారమంత్రి మున్షీ



హోత్సవ సందర్భంలో భారత వ్యవసాయశాఖమంత్రి శ్రీ కె. మున్షీ గారు పురంలోని వరదరాజస్వామిదేవాలయంలో తులశి మొక్క నాటుతున్నారు.



మద్రాసు ప్రభుత్వ కార్యాలయంలో భారత వ్యవసాయశాఖమంత్రి శ్రీ కె. ఎం. మున్షీ గారికి మద్రాసు ప్రధాని శ్రీ కుమారస్వామిరాజాగారి ఆహ్వానం.



★

భారత వ్యవసాయశాఖమంత్రి శ్రీ మున్షీ మద్రాసు మంత్రులతో "అధికాహారోత్పత్తి" కార్యక్రమాన్నిగూర్చి చర్చించుతున్నారు.

★




| సంవత్సరచందా<br>రు. 12-0-0<br><br>విడిప్రతిక<br>4 అణాలు | ప్రతిబుధవారము ప్రకటింపబడును.<br>ఒరులేయవియొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా<br>నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్.<br>(మహాభారతము)<br>**Founder : K. NAGESWARA RAO** | సంపుటము **42**<br><br>సంచిక **45** |
|---|---|---|

వికృతి సంవత్సర అధికాషాఢ బహుళ ద్వాదశి బుధవారము




"జీవితము" చిత్రంలో వైజయంతీమాల ఆటవిక నృత్యం.



ఆంధ్రపత్రిక

1950-వ సం॥ జూలై నెల 12-వ తేది బుధవారము

# భారతీయ రాజనీతి

ఆధునికయుగమున సైనికబలము, ఆర్థిక వ్యాపారబలములే ఆయా దేశముల రాజనీతికి ప్రాధాన్యత నొసగుచున్నవి. కాని గాంధీమహాత్ముని ప్రభావమువలన ధర్మమునకు గూడ రాజనీతియందును, అంతర్జాతీయవ్యవహారములందును తావు లభించినది. భారతదేశమున మాన్యులైన జవహర్లాల్ నెహ్రూ, రాజేంద్రప్రసాద్, వల్లభాయ్‌పటేల్ ప్రభృతుల ఆధ్వర్యమున ప్రభుత్వము యథాశక్తిని ధర్మమార్గమునే యనుసరించుచున్నది. పాశ్చాత్యదేశముల రాజనీతిజ్ఞతకు బాల్డ్విన్, లాయిడ్‌జార్జి, ప్రభృతులు ఒరవడి పెట్టిరి. మన దేశరాజనీతిజ్ఞతకు గాంధీమహాత్ముడు మార్గదర్శకుడు. బ్రిటిష్ రాజనీతిజ్ఞతను ఈనాడు అమెరికా చాకచక్యముతో అనుసరించజాలకున్నను, అనుకరించ యత్నించుచున్నది. రష్యాలో సామ్యవాదప్రభుత్వమేర్పడినను పూర్వసామ్రాజ్యవాదకూట రాజనీతిజ్ఞతను విడువజాలకున్నది. అంతేకాదు. లెనినిస్టు దృక్పథముతో, లక్ష్యమే ప్రధానముగ, సాధనపరికరముల యందు నీతి యవివేకమని నమ్మి, ఆ కూటనీతికి పదును పెట్టినది. విద్రోహమును దేశభక్తియని చాటి, అరాచకమును రాజకీయపరికరముగ ప్రయోగించి అశాంతిని శాంతియనియు, శాంతవ్యవస్థను ప్రజాపరిపీడనయనియు నమ్మింపజూచుచు ప్రచారము చేయగలుగుచున్నది.

ఈ పాశ్చాత్యరాజనీతిజ్ఞులు చెప్పునది కొంత, చెప్పక చేయునది కొండంత. చెప్పునది యొకటి, చేయునది మరొకటి, వ్యాఖ్యానము భిన్నముగ నుండును. ఈరీతిగ దేశములను ప్రజాసమూహములను మోసగించి స్వార్థాశయసిద్ధికై పాటుపడుచున్న దేశముల యందు రాజనీతిజ్ఞత యను పదమునకు నీతికి దూరమైనదను విపరీతార్థము కల్పించబడినది. ప్రపంచమంతటనూ ఈ రాజనీతిజ్ఞతే ప్రబలముగ నుండి, ఈ రాజనీతిజ్ఞులే ప్రపంచవ్యవహారములను నిర్వహించుచున్నందువల్లనే భారతీయులు చెప్పుమాటలకు, చేయుపనులకు విపరీతార్థములను చెప్పుకొనుచున్నారు. తమ కనుకూలమగు చోట హర్షించి ప్రతికూలమగు చోట గర్హించుచున్నారు. కాని ఈ హర్షమునకు గాని నిరసనకు గాని విలువ యెంత కలదో గుణించి ప్రయోజనము లేదు

స్వాతంత్ర్యము సిద్ధించినది మొదలు భారతప్రభుత్వము ప్రపంచవ్యవహారములందు నీతిమార్గమే ప్రధానముగ వర్తించినది. రష్యన్, అమెరికన్ రాజ్యకూటములందు జోక్యము చేసుకొనజాలరనియు, తటస్థవిధానమే తమ ప్రధానలక్ష్యమనియు, ప్రపంచమున శాంతిరక్షణకు, శాంతిసాధనకు ప్రస్తుతపరిస్థితులందు తటస్థవిధానమే భారతదేశమున కనుసరణీయ మగు ననియు మన ప్రధానామాత్యులు జవహర్లాల్ నెహ్రూ అనేక పర్యాయములు చెప్పియుండిరి. అమెరికాపర్యటనలో గూడ నెహ్రూ ఈ విషయమును ఆ దేశస్థులకు నిష్కర్షగ తెలిపియుండిరి.

కొరియాయుద్ధసందర్భమున భద్రతామండలి తీర్మానము నామోదించుటతో భారతప్రభుత్వతటస్థవిధాన మంతమైనదని కొందరు వ్యాఖ్యానించిరి. మరి కొందరిది సంకుచితయవకాశవాదమని నిందించిరి. ఇట్టి వ్యాఖ్యలకును విమర్శలకును పాశ్చాత్యరాజనీతిజ్ఞతా దృక్పథమే హేతువు. ఆ దృక్పథమున కలవడినవారికి ధర్మమార్గము సుబోధకము కాజాలకపోవుటలో నాశ్చర్యము లేదు. అందువలన భారతప్రభుత్వవిదేశాంగనీతిని ప్రధానామాత్యులు విదేశాంగశాఖామాత్యులునైన జవహర్లాల్ నెహ్రూగారు స్పష్టపరచవలసి వచ్చినది.

యుద్ధమేఘము లావరించిన నేటి ప్రపంచమున

శాంతిని కాంక్షించి రక్షించ యత్నించు సంస్థ ఐక్యరాజ్యసమితి తప్ప మరియొకటి లేదనునది నిర్వివాదాంశము. ప్రపంచములోని సర్వవర్గములు సర్వదేశముల మధ్య సహకారమును సాధించునది, వివాదములను పరిష్కరించునది సమితి యొక్కటే. ఇంతవరకును ఈ రెండులక్ష్యములను సమితి సాధించజాలకపోయినచో రష్యా అమెరికా రాజ్యకూటముల వైషమ్యములు, కూటరాజనీతిజ్ఞతయే హేతువుగాని సమితిలోపము గాదు. సమితినియమములను, సమితియాదేశములను ధిక్కరించుట ప్రపంచశాంతిని భగ్నము గావించు చర్యయే గాని సమర్థనీయము గాజాలదు. కాబట్టి దురాక్రమణ నేరమునకు బాధ్యులు, సమితిధిక్కరణద్వారా ప్రపంచ శాంతిని భగ్నమొనర్చువారైన ఉత్తరకొరియా ప్రభుత్వాధికారులను నిరోధించక తప్పదు. నిరోధించనిచో నెహ్రూ చెప్పినట్లు సమితియే నిరర్థకము కాగలదు. అందువలన సమితియాదేశమునకు భారతప్రభుత్వ మామోదించుట ధర్మసమ్మతము. అంతేకాని ఇది అమెరికా రాజ్యకూటముపట్ల పక్షపాత మనిపించుకొనదు. భారతప్రభుత్వవిధానమును తటస్థవిధానమనుటకంటె ధర్మమార్గానువర్తన యనుట మేలు. అన్యాయము, దౌర్జన్యము నెచట సంభవించినను నిరోధించుటే ఈ విధానమునకు మూలము.

కాశ్మీరసమస్య భద్రతామండలిలో చర్చకు వచ్చినప్పుడు అమెరికా ఎట్టి వైఖరి యవలంభించినను, మండలినిర్ణయము లెట్లున్నను, ఆ లోపములు వారివే కాగలవు. వా రనుసరించిన కూటనీతిజ్ఞతనే యనుసరించి భారతప్రభుత్వము సాధించగలుగున దేమియు లేదు. అందువలననే కాశ్మీరమున గూడ దురాక్రమణ నరికట్టుటకు యుద్ధము చేసి భారత ప్రభుత్వము కర్తవ్యపాలన మొనరించినది.

ఐక్యరాజ్యసమితిని, ప్రపంచశాంతిని కాపాడుటకుగాను చీనాకమ్యూనిస్టు ప్రభుత్వప్రతినిధిని సమితియందును భద్రతామండలియందును ప్రవేశపెట్టుట తక్షణావశ్యకమనియు, తద్వారా రష్యా ప్రతినిధికి భద్రతామండలిలో పాల్గొనుట కవకాశ మివ్వవలసి యున్నదనియు జవహర్లాల్ నెహ్రూ చెప్పియున్నారు. ఆ ప్రకారము అన్యదేశములతో రాయబారములను జరుపుచున్నట్లుగూడ తెలిపినారు. పెకింగ్, మాస్కో ప్రభుత్వములు భద్రతామండలియందు ప్రవేశించిన గాని కొరియాసమస్య ఇండోనిషియా సమస్యవలె శాంతియుతముగ పరిష్కృతముకాదు. కొరియాసమస్య పరిష్కారమప్పుడు యుద్ధమువలనగాక భద్రతామండలి ద్వారా సాధ్యమగును. తక్షణమే కొరియాలో అంతర్యుద్ధము నరికట్టజాలకపోయినను, అది ప్రపంచసంగ్రామముగ పరిణమించకుండ నివారింప వీలగును.

జవహర్లాల్ నెహ్రూగారి వివరణవలన భారత ప్రభుత్వవిదేశాంగవిధానమునకు ప్రపంచశాంతియే ప్రధానలక్ష్య మనియు, ఏయొక కూటమునకు సహాయ మనునది హేతువు కాదనియు, వైషమ్యము లున్నచోట తటస్థము, శాంతికి భంగము కలిగినచోట శాంతిసాధన, దౌర్జన్యము సంభవించినప్పుడు న్యాయమార్గానుసరణ ప్రాతిపదికలనియు స్పష్టమగుచున్నది.

# ఆహార సమస్య

కేంద్రప్రభుత్వఆహారశాఖామంత్రి కే. యం. మున్షీగారు మద్రాసులో సుమారు వారము దినములు ఆహారసమస్య గురించి రాష్ట్రప్రభుత్వముతో చర్చ జరిపిరి. మన రాష్ట్రమున ఆహారపదార్థముల అవసరములను గమనించి తగుసహాయము చేయుటకు సంకల్పించినట్లు వారు తెల్పిరి. మనకు పంపవలసియున్న గోధుమలలో లక్షటన్నులను అన్యప్రాంతములకు పంపి, లక్షాఅరవైతొమ్మిదివేల టన్నుల బియ్యమును మనకు పంపగలిగినచో, ఈ రాష్ట్రమున ఆహారదుస్థితి నివారింప వీలగుననియు, రేషన్ పదౌన్సులనుండి తిరిగి ఎనిమిదౌన్సులకు హెచ్చించుటకు కూడ వీలగుననియు మద్రాసుప్రభుత్వము వారు మంత్రి మున్షీగారికి తెలియజేసిరి. అట్లు యత్నించగలరని మంత్రిమున్షీగారు వాగ్దానమిచ్చిరి.

గోధుమల వాడుక అభ్యాసములేని ఈ రాష్ట్రమున కొత్తగా అభ్యాసము తెచ్చిపెట్టినచో మద్రాసు రాష్ట్రము నిత్యము గోధుమలనిమిత్తము కేంద్రప్రభుత్వముపై ఆధారపడవలసిన స్థితి రావచ్చును. కాబట్టి మద్రాసుప్రభుత్వము చేసిన సూచన ఉత్తరాదివారికిని దక్షిణాదివారికిని గూడ సముచితమైనది. మన రాష్ట్రమున అవసరమగు ధాన్యము నుత్పత్తిచేయుటకు

యత్నించి స్వయంసమృద్ధిని సాధింపవలయునేగాని రెండుమూడుసంవత్సరములుగ జరుగుచున్నట్లు నిర్బంధముగ గోధుమలను మన కిచ్చుటవలన మన ఆహార సమస్య పరిష్కృతము కాజాలదు. అంతవరకును అవసరమగు ప్రాంతముల రేషనింగు, విక్రయనిబంధనలు గూడ అవసరమగుచున్నవి.

ఆంధ్రవాణిజ్యసభాసభ్యులతో ప్రస్తావించుచు, ఆహారవిక్రయము ధరల నిర్ణయములపై ప్రభుత్వ నిర్బంధముల నిప్పుడు తొలగించుటకు వీలుపడదని మున్షీగారు స్పష్టపరిచిరి. వర్తకప్రతినిధులు ఈ నిర్బంధములను తొలగించి,ఆహారపదార్థముల వ్యాపారమును సహజ వ్యాపారగతికి విడిచిపెట్టినచో నేటి దుస్థితి నివార్యమగుననియు, ఈనిర్బంధములవలన సంభవించిన యుద్యోగుల యవినీతియే ఈ దుస్థితికి హేతువనియు, వాస్తవముగ దేశమున ఆహారపదార్థములకు కొదువ లేదనియు వాదించిరి. ఆహారపదార్థముల విక్రయమును సహకారసంఘముల కొప్పగించరాదనియు, దీనివలన అనేకవర్తకులు వృత్తిని గోల్పోయెదరనియు వారు చెప్పిరి. కాని ఆహారపదార్థముల వ్యాపారమును నిర్దిష్ట మార్గమున పెట్టవలసిన యవసరమును గ్రహించిన అమెరికా మొదలగు స్వేచ్ఛావ్యాపారదేశములే సహకార సంఘములను ప్రోత్సహించుచుండ, ఆర్థికస్థితిగతులు అనిర్దిష్టస్థితియందున్న భారతదేశమున ఆ సంఘము లత్యంతావశ్యకములని చెప్పకతప్పదు. భారతప్రభుత్వఅభిప్రాయముగూడ నిట్లేయుండుట వలన, ఇంతలో నిర్బంధములు తొలగింపబడవనియే భావించవచ్చును.

ఈ నిర్బంధములను తొలగించవలెనన్నచో దేశమున ఆహారపదార్థములేగాక ప్రత్తి, జనపనార మొదలగు వ్యాపారపంటల యభివృద్ధినికూడ సాధించవలసియున్నదని మున్షీగారు పత్రికాసమావేశమున చెప్పిరి. దేశమున ఏయే ప్రాంతములందెట్టి పంటలను పండించినచో యుత్పత్తి వృద్ధికాగలదో, ఏయేప్రాంతముల నీటి సదుపాయమును సులువైన పద్ధతులపై వృద్ధిపరచి ఆహారపదార్థముల యుత్పత్తివృద్ధి చేయ వీలగునో పరిశీలించి, సమగ్రమైన కార్యక్రమము నొకదానిని తల పెట్టినట్లు మున్షీగారు చెప్పిరి.

కాని వీరు వివరించిన కార్యక్రమములందు దీర్ఘకాలికప్రణాళికలు ఇరిగేషన్ ప్రాజెక్టులకు తగినంత ప్రాధాన్య మివ్వబడలేదు. పెద్ద నదుల నీటిని వినియోగపరచజాలకున్నచో ఆహారమున స్వయంసమృద్ధి సాధించుట యసంభవము. భూగర్భమున గల నీటిని తెచ్చి సాగుకు వినియోగించుటవలన అక్కడక్కడ కొద్దిభూమికి తాత్కాలికోపయోగమునే సమకూర్చగలుగును గాని స్వయంసమృద్ధి సాధ్యము కాదు. చెరువులు, బావులవలన భూమి యధికముగ సాగులోనికి రాదు. ఈవిషయమును గ్రహించనంత కాలము, అతివృష్టి యనావృష్టులతో పంటకువచ్చిన పొలములే పాడగుచున్న పరిస్థితిలో, ఆహారస్వయంసమృద్ధి కష్టసాధ్యము.

---

# విషయానుక్రమణిక
## 12 జూలై 1950

# నేటిప్రపంచం

## ప్రపంచ శాంతిరక్షణ * ఐక్యరాజ్య సమితి *

కమ్యూనిస్టుదండయాత్రను నిరోధించడానికి దక్షిణకొరియా ప్రభుత్వానికి సహాయపడవలసిందిగా ఐక్యరాజ్యసమితిసభ్యులకు భద్రతామండలి ఇచ్చిన ఆదేశతీర్మానాన్ని భారతప్రభుత్వం పూర్తిగా ఆమోదించింది. ప్రపంచరాజ్యకూటాల వైరాలలో ఏ పక్షాన్నీ సమర్థించక భారతప్రభుత్వం అవలంబిస్తున్న తటస్థవిధానం దీనితో అఖరైనట్లేనని అనేకులు వ్యాఖ్యానించారు. కాని భారతప్రభుత్వవిదేశాంగ విధానంలో మార్పేమీ ఉండబోదని భారతప్రభుత్వం మొదటే స్పష్టపరిచింది.

ఈమాసం పత్రికాసమావేశంలో ప్రధాని పండిట్ నెహ్రూ ఈవిషయాన్ని విపులంగా చర్చించారు. కేవలం శాంతిసాధనకోసమే కొరియాసందర్భంలో భద్రతామండలితీర్మానాన్ని ఆమోదించారని పండిట్ నెహ్రూ చెప్పారు. ఎన్ని లోపాలున్నా, ఎంత బలహీనమైనదైనా ఐక్యరాజ్యసమితి ఒక్కటే ఈనాడు ప్రపంచంలో శాంతిని రక్షించగల పరికరమన్నారు. దురాక్రమణ సంభవించినప్పుడు, దురాక్రమణపరులు ఐక్యరాజ్యసమితిఆదేశాన్ని ధిక్కరించినప్పుడు, సమితికర్తవ్యం దురాక్రమణను నిరోధించడమే. లేనిపక్షంలో సమితి శాంతిరక్షణసంస్థ కానేరదని నిర్ధారణచేసుకుని, వివాదాల్ని యుద్ధాలద్వారానే పరిష్కరించుకోనివ్వాలి. అంటే సమితి ఆత్మహత్యచేసుకున్నట్టే. అయితే ఈ అయిదేళ్లలోనూ దురాక్రమణ, దురన్యాయం సంభవించినప్పుడెల్ల సమితి ఈరీతిగా భావించలేకపోయిందా? కాశ్మీరసమస్య ఉత్పన్నమైనప్పుడు దురాక్రమణదారుల్ని అమెరికా ఎందుకు నిరోధించయత్నించలేదని ఒకరు ప్రశ్నించినప్పుడు, దీనికి తాము సమాధానం చెప్పజాలమనీ, సమాధానమివ్వవలసినది అమెరికాయేననీ పండిట్ నెహ్రూ అన్నారు.

అమెరికా ఎందుకు నిరోధించలేదన్న ప్రశ్నే వచ్చిందిగాని, ఐక్యరాజ్యసమితి ఎందుకు నిరోధించలేకపోయిందని ప్రశ్నించలేదు. ఆప్రశ్నే వస్తే సమితికి గల లోపాల్లో అవొకటనీ, ఇదివరకు చేసిన తప్పిదాల మూలంగా ఇప్పుడుకూడా తప్పిదం చెయ్యనవసరంలేదనీ పండిట్ నెహ్రూ చెప్పి ఉండేవారు.

భారతప్రభుత్వవిదేశాంగవిధానాన్ని తటస్థవిధానం అనడంకంటె, ఆయా సమస్యల న్యాయాన్యాయాలనుబట్టి న్యాయాన్ని అనుసరించే విధానమని చెప్తే బాగుంటుందని ఇటీవల సమితిలో భారతప్రతినిధి బి. యన్. రావు గారన్నారు. అయితే కేవలం న్యాయాన్యాయాలపైనే నిర్ణయాలు చెయ్యడానికీ, కాలానుగుణంగా పరిస్థితుల ననుసరించి నిర్ణయాలు చెయ్యడానికీ వ్యత్యాసం ఉంది. ఫార్మోజాద్వీపానికి అమెరికా నౌకాబలాన్ని పంపడం దురాక్రమణగా పరిగణించి అమెరికాపై చర్య తీసుకోవాలని, భద్రతామండలిలో యుగోస్లావియా తీర్మానం ప్రతిపాదిస్తే భారతదేశం బలపరుస్తుందా?

ఆసియాలో శాంతిరక్షణ, రాజకీయదాస్యవిముక్తి భారతప్రభుత్వలక్ష్యాలైనప్పుడు ఫార్మోజాసమస్య పరిష్కారానికై భద్రతామండలిలో భారతప్రభుత్వమే తీర్మానం ప్రతిపాదించరాదా?

కొరియాయుద్ధం తృతీయ ప్రపంచ సంగ్రామానికి దారితియ్యకపోవచ్చునుగాని ఫార్మోజా సమస్య ప్రపంచసంగ్రామంగా పరిణమించగల సూచనలు కానవస్తున్నాయి. అగ్రరాజ్యనిర్ణయాలప్రకారం ఫార్మోజా చీనాకు చెందవలసిందే. చీనా అంతర్యుద్ధంలో అమెరికా (కొరియాలోవలె) ప్రత్యక్షంగా జోక్యం చేసుకోలేదు. ఇప్పుడు చీనాకుచెందిన ఫార్మోజా సమస్యలో అమెరికా జోక్యం చేసుకున్నందువల్ల చీనాఅంతర్యుద్ధంలో జోక్యంచేసుకున్నట్లే అయింది. ఫార్మోజాను అమెరికన్లకు ఒప్పగించి చీనా కమ్యూనిస్టులు చూస్తూ ఊరుకోవడం అసంభవం. త్వరలో అమెరికన్ నౌకాబలం ఫార్మోజాను విడిచివెళ్ళకపోతే చీనాకమ్యూనిస్టులు తరుణంచూసి దండయాత్ర ప్రారంభించకమానరు. చీనారష్యాల ఒడంబడిక ననుసరించి రష్యా ప్రత్యక్షంగా చీనాకు సహాయం చెయ్యవలసిరావచ్చును. అప్పుడు ప్రపంచయుద్ధం అనివార్యమే కాగలదు. కాబట్టి ప్రపంచశాంతిరక్షణార్థం, ముఖ్యంగా ఆసియాలో శాంతిరక్షణార్థం ఫార్మోజా సమస్య తీవ్రంగా పరిణమించకుండా జాగ్రత్తపడవలసిన అవసరం ఉంది. ఆ బాధ్యత భద్రతామండలిలో సభ్యత్వం కల రెండేరెండు ఆసియాదేశాలు చీనా భారతదేశాలలో భారతదేశంపైన లేదా? అటువంటి తీర్మానం ప్రవేశపెట్టినందువల్ల నిష్ప్రయోజనమే కావచ్చును. యుగోస్లావియా తప్ప మరొక దేశమేదీ అనుకూలంగా వోటు చెయ్యకపోవచ్చును. కాని న్యాయాన్యాయనిర్ణయం, ప్రపంచశాంతి ప్రధానలక్ష్యాలుగా కల భారతదేశం ఫార్మోజాగురించీ, చీనాకమ్యూనిస్టుప్రభుత్వసభ్యత్వం గురించీ భద్రతామండలిలో చర్చ జరిపించవలసిన అగత్యాన్ని గుర్తించవలసిందే. అలా చెయ్యనిపక్షంలో భారతప్రభుత్వవిదేశాంగ విధానంలో మూలసిద్ధాంతం న్యాయనిర్ణయంకాదు. అవకాశవాదం మాత్రమే కాగలదు.

భారతప్రభుత్వం చీనాకమ్యూనిస్టు ప్రభుత్వాన్ని ఐక్యరాజ్యసమితిలో ప్రవేశపెట్టడానికి యత్నిస్తోంది. చీనాకమ్యూనిస్టు ప్రభుత్వాన్నిగురించి సమితిలో ప్రవేశపెట్టడానికి తోడ్పడవలసిందిగా పండిట్ నెహ్రూ ఈజిప్టుప్రధాని నహాస్‌పాషాకు స్వయంగా విజ్ఞప్తిచేశారు. వాస్తవంగా చీనాదేశాన్ని పరిపాలిస్తున్న ప్రభుత్వాన్ని సమితిలో ప్రవేశించనియ్యకపోవడంవల్లనే రష్యా భద్రతామండలినుంచి నిష్క్రమించిందనీ, అందువల్లనే అంతర్జాతీయపరిస్థితి ప్రమాదంగా పరిణమించిందనీ పండిట్ నెహ్రూ పత్రికాసమావేశంలో చెప్పారు. కాబట్టి పెకింగ్ ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టడానికి భారతప్రభుత్వం యత్నిస్తున్నదని చెప్పారు.




కొరియాలో శాంతి నెలకొల్పడానికీ, భద్రతామండలి సక్రమంగా వ్యవహరించగల గడానికీ పెకింగ్ ప్రభుత్వాన్నీ, రష్యన్ ప్రభుత్వాన్నీ భద్రతామండలిలో ప్రవేశపెట్టడం అవసరమే. కాని చీనారష్యాలను ప్రవేశపెట్టడం అంతసులువుగాదు. ఫొటో

జా కొరియాలనుంచి అమెరికన్ బలాలు తొలగిపోతేగాని, భద్రతామండలి కొరియా తీర్మానాల్ని ఉపసంహరించుకుంటేగాని రష్యా చీనాలు భద్రతామండలిలో ప్రవేశించడం అసంభవం. ఆ దేశాలే ప్రవేశించే పక్షంలో కొరియాలో మిలిటరీ చర్యలు తీసుకోడానికి నిరాకరించి రష్యాచీనాలు వీటో ప్రయోగించడం తథ్యం. రష్యా నిష్క్రమించి ఉండకపోతే సరిగ్గా ఇదే జరిగిఉండేది. అప్పుడు అమెరికా దక్షిణ కొరియాను రక్షించడానికి ఆ ప్రభుత్వంతో ఒడంబడిక చేసుకోవడమో మరొకటో అన్యమార్గాల నవలంబించవలసి వచ్చేది. ఇప్పుడుకూడా అమెరికా అన్యమార్గాల నవలంబించివున్నట్లయితే ఐక్యరాజ్యసమితికి ముప్పు వచ్చిఉండేది కాదు. ప్రపంచయుద్ధ భయంకూడా ఉండేది కాదు. కాని అమెరికా ఆంతర్యం ఈ భయాలతో నిమిత్తం లేనిదని స్పష్టపడింది. చీనారష్యాలు భద్రతా మండలిలో ఉండినట్లయితే ఐక్యరాజ్యసమితి మిలిటరీ చర్య తీసుకోవడం అసంభవమయ్యేదే. కాబట్టి ఐక్యరాజ్యసమితి ఒక్కటే ప్రపంచంలో శాంతిని రక్షించగల ఏకైక సంస్థ అనే ఆశకు అట్టే ఆధారంలేదు. శాంతిని రక్షించగల సంస్థగా ఐక్యరాజ్యసమితిని పరిగణించాలంటే కొన్ని మార్పులు అవసరమౌతాయి. వీటో అధికారం, నిర్ణయాధికారప్రాబల్యం అమెరికా రష్యా బ్రిటన్ ఫ్రాన్సుల చేతిలో ఉన్నంతవరకూ భద్రతామండలి ప్రపంచ శాంతిని భద్రపరచడం అసంభవం. ఆ అధికారాన్ని రద్దుచేసి, వోటింగువిషయంలో చిన్న రాజ్యాలకు, సైనికంగా బలహీనంగా ఉన్న రాజ్యాలకు బలమైన రాజ్యాలతో సమానహక్కులు అధికారాలు ఇవ్వబడినప్పుడే భద్రతామండలిలోనూ, ఐక్యరాజ్య సమితిలోనూ వాస్తవంగా శాంతిని కాంక్షించేవారి బలం అధికం కాగలదు. అప్పుడే ఐక్యరాజ్యసమితి శాంతిరక్షణపరికరం కాగలదు. కాని రష్యా అమెరికాల వైఖరినిబట్టి ఇది అసంభవమని స్పష్టమౌతోంది. అందువల్ల సమితి శాంతి రక్షణకు ఏకైక సంస్థ అని చెప్పుకోడం సత్యం కాజాలదు.

కొరియాలో ఆటంబాంబు ప్రయోగించి దురాక్రమణను నిరోధించరాదా అని ఒకరు సూచించినప్పుడు పండిట్ నెహ్రూ "అసలు ఏటంబాంబుల్ని పూర్తిగా నిషేధించాలని నా అభిప్రాయం" అని సమాధానమిచ్చారు. ఈ అభిప్రాయంతో రష్యన్ అమెరికన్ పరిపాలకవర్గాలు మినహా, ప్రపంచమంతా ఏకీభవిస్తుంది. కాని ఇది ఇప్పుడు అసాధ్యం. అసాధ్యం కావడానికి కారణం మళ్ళీ అమెరికా, రష్యాలేననీ, ఐక్యరాజ్యసమితిలో గల లోపాలూ బలహీనతేననీ చెప్పుకోవాలి. వీటో అధికారాని కంగీకరించిన సమితి, రష్యా ప్రవేశానికి అనుకూలపరిస్థితుల్ని కూడా ఏర్పరచవలసిన ఆగత్యాన్ని గుర్తించక తప్పదు. రష్యాలేని సమితి ప్రపంచశాంతిని కాపాడజాలదు. తృతీయప్రపంచ యుద్ధాన్ని నివారించలేదు. చీనాకమ్యూనిస్టు ప్రభుత్వాన్ని బ్రిటన్ గుర్తించి రాయబార కార్యాలయాలు నెలకొల్పుకోవడానికి మలయా హాంకాంగ్‌లలో తమ స్థావరాల్ని కాపాడుకోడానికే నని బెవిన్ చెప్పాడు. అదేరీతిగా రష్యా చీనాలను సమితి నిబంధనలకు, సమితి ప్రమాణాలకు బంధించకపోతే మరింత ముప్పు తప్పని సరి కాగలదు. ఈసమితిలో తటస్థవర్గమే కొరవగా ఉన్నప్పుడు, కొరియాసమస్య సందర్భంలో భారత ప్రభుత్వం తటస్థంగా ఉన్నట్లయితే, సమితిని కాపాడ్డానికి అవకాశంకొంతైనా ఉండేది. కాని ఇప్పుడా కొద్ది ఆశకూడా అంతరించినట్లే.

## యుద్ధ నినాదాలు *

కొరియా యుద్ధంలో అమెరికా ప్రవేశించడంతో ప్రపంచ మంతటా యుద్ధ నినాదాలు బయలు దేరాయి. అమెరికాలో రిజర్వుదళాలు బలపరచబడుతున్నాయి. ఫార్మోజా కొరియాలలో అమెరికా జోక్యంచేసుకుందికాబట్టి, అమెరికన్ సామ్రాజ్యవాదుల దురాక్రమణను అరికట్టి సామ్రాజ్యవాదాన్ని అంతమొందించడానికి ఆసియా ప్రజానీకం దీక్ష వహించాలని చీనా ప్రధాని చౌ ఎన్ లై ఆదేశించాడు. అమెరికన్ సైన్యాలకు కొరియానుంచి తొలగించాలని రష్యన్ విదేశాంగశాఖ ఉపమంత్రి గ్రొమైకో భద్రతామండలిని కోరాడు. కొరియా ఛానెల్‌లో అమెరికా విధించిన నౌకాదిగ్బంధం అక్రమమైనదనీ, దీనివల్ల సంభవించగల దుష్ఫలితాలకు అమెరికాయే బాధ్యత వహించాలనీ మాస్కో ప్రభుత్వం అమెరికన్ ప్రభుత్వాన్ని హెచ్చరించింది. తూర్పుజర్మనీలో తూర్పు జర్మన్ సైన్యాలు, యుగోస్లావియా సరిహద్దులో బల్గేరియన్ సైన్యాలు, తూర్పు ఆస్ట్రియాలో రష్యన్ సైన్యాలు, పోలెండులో పోలిష్ సైన్యాలు సమీకరించబడుతున్నాయని అమెరికన్ పత్రికలు తెలుపుతున్నాయి. ఉత్తరకొరియా సరిహద్దుల్లో చీనా కమ్యూనిస్టుసైన్యాలు కేంద్రీకరింపబడుతున్నాయని కూడా తెలుపుతున్నాయి.

ఇదే సమయంలో ఇండో పాకిస్తాన్ వివాదాల పరిష్కారం తక్షణావసరమనే ప్రకటనలు వినవస్తున్నాయి. పాకిస్తాన్ ప్రధాని లియాఖత్ అలీఖాన్ వైఖరిలో మళ్ళీ మార్పు కానవస్తోంది. నెహ్రూ-లియాఖత్ ఒడంబడికను, ఇండో - పాకిస్తాన్ వాణిజ్యపు టొడంబడికను పాకిస్తాన్ అక్షరాలా అమలుజరుపుతున్నదనీ, "భారతదేశంవిషయంలో కూడా అటువంటిమాటే చెప్పగలిగిఉంటే చాలా సంతోషించేవాడిని" అనీ లియాఖత్ అలీ లండన్‌లో అన్నాడు. ఆయనసంతోషించడంలేదట. అంటే భారతదేశంలో అమలుజరగడం లేదని వారు ఆరోపిస్తున్నారు. కాశ్మీర్ సమస్య త్వరలోనే పరిష్కారం కావలసి ఉన్నదని పండిట్ నెహ్రూ అన్నారు. ఇండోచీనాలో యుద్ధం తీవ్రంగా జరుగుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. పశ్చిమ యూరప్‌లో మిలిటరీనిపుణులు దీర్ఘ సమావేశం జరుపుతున్నారు. (ఫ్రెంచి) సైనిక బలాలు పశ్చిమ జర్మనీలో సాయుధపోలీసు బలాలు వృద్ధిపరచబడుతున్నాయి. అమెరికాలో యుద్ధపరికరాల ఉత్పత్తి ద్విగుణీకరించబడుతోంది. ఈవిధంగా ప్రపంచ మంతటా రక్షణ, సైనికసన్నాహాలు, చురుగ్గా సాగుతున్నాయి. యుద్ధవాతావరణం అలుముకుంటోంది. ప్రజల్లో యుద్ధభీతి వృద్ధిఅవుతోంది. కొరియాయుద్ధం ప్రపంచయుద్ధంగా పరిణమించకపోవడాని కెంత అవకాశం ఉందో, పరిణమించడానిక్కూడా అంతే అవకాశం ఉందని పండిట్ నెహ్రూ అన్నారు.

## కొరియా యుద్ధగతి *

దక్షిణకొరియా సైన్యాలు కమ్యూనిస్టు టాంకుల ధాటికి తాళలేక చెల్లాచెదరై పోరలేక పోతున్నందువల్ల యుద్ధంలోకి అమెరికన్ సైన్యాలను పంపుతూ అధ్యక్షుడు ట్రూమన్ 30 వ తేదీ శుక్రవారంనాడు ఆజ్ఞ ఇచ్చాడు. ఆరోజునే దక్షిణతీరాన పూసాన్ నౌకాశ్రయంలో జపాన్‌నుంచి అమెరికన్ సైన్యాలు దిగాయి. విమానా

(39-పేజీ చూడుడు)

# మనదేశం

కాంగ్రెస్‌నుంచి విడివడినతరువాత సోషలిస్టుపార్టీ రెండవ సర్వసభ్య సమావేశం చెన్నపట్నంలో శ్రీ అశోకమెహతా అధ్యక్షత క్రింద జరిగింది. ముప్ఫైయేళ్లుపైగా శ్రీ జయప్రకాశనారాయణ నాయకత్వం క్రింద క్రమక్రమాభివృద్ధిపొందుతూ రాజకీయవిశిష్టతను సాధించడానికి కృషిచేస్తున్న సోషలిస్టులకు ఇది ఎనిమిదవ వార్షికసమావేశం. కాంగ్రెస్‌నీడను పెరుగుతూ ఆదినుంచీ విశిష్టత లేక, తరువాత కమ్యూనిస్టుల కుట్రవల్ల దేశమంతటా పార్టీబలాన్ని కోల్పోయినసోషలిస్టుపార్టీ, కాంగ్రెస్, కమ్యూనిస్టుపార్టీల కెదురై నిల్చి వ్యక్తిత్వాన్ని రూపొందించుకోడానికీ, దేశీయ రాజకీయాల్లో విశిష్టస్థానం ఆక్రమించుకోడానికీ ఇప్పుడు యత్నిస్తోంది.

ఈపరిణామంలో సోషలిస్టుపార్టీ విశేషలక్షణా లేమిటో, కాంగ్రెస్‌కమ్యూనిస్టు పార్టీలకంటే భిన్నమైన వీరి రాజకీయాశయా లేవో ప్రజలు సుస్పష్టంగా గుర్తించలేకపోవడం సహజమే. కాని పార్టీనాయకులకే తమలక్ష్యాలు, ఆశయాలు, కార్యక్రమవిధానం సుస్పష్టంగా నిర్ణయించుకోలేనప్పుడు ప్రజలకెట్లా విశదపరచగలుగుతారు?

కాంగ్రెస్ కమ్యూనిస్టుపార్టీలతో చిరకాలసాంగిత్యమే ఈ అసందిగ్ధస్థితికి హేతువయింది. దేశంలో కాంగ్రెస్ పరిపాలనపట్లను, కమ్యూనిస్టుల అరాచకచర్యలపట్లనూ విసిగి నిస్పృహ చెందుతున్న ప్రజలకు ఏకాంత ఆశారేఖ చూపగలిగినా, బలంచేకూర్చుకోగల అపూర్వావకాశం అన్యరాజకీయపక్షాలకు లభించింది. కాని మనదేశంలో సోషలిస్టు పార్టీ మినహా చెప్పుకోదగిన అన్య రాజకీయపక్షాలు లేనేలేవు. ఈతరుణాన్ని సోషలిస్టులు వినియోగించుకోలేకున్నారంటే వారి నాయకత్వబలంలో లోపం, వారి ఆశయాలప్రచారంలో లోపం, కారణాలు. ఈతరుణాన్ని వినియోగించుకోవాలని సోషలిస్టులకు తెలిసే చాల తాపత్రయపడుతున్నారు. కాని నాయకులకే ఆత్మవిశ్వాసం, లక్ష్యనిర్ణయం అసందిగ్ధరాజకీయ కార్యక్రమం లేకపోవడంవల్ల వారు కూడా నిస్పృహ చెందారు. నాయకుల నిస్పృహ చెన్నపట్నం వార్షిక సమావేశంలో స్పష్టంగా కానవచ్చింది. తమలో కల నిస్పృహనే ప్రజలలో నిస్పృహగా భావించి ఈ నిస్పృహనుంచి విడివడాలని అశోక మెహతా ప్రజలకు ద్బోధించారు. కాని ప్రజల నిస్పృహ ఉపన్యాసాలతో తొలగిపోదు. ముందుగా పార్టీ నిస్పృహను విదల్చుకొని, ప్రజలు అర్థం చేసుకోగల కార్యక్రమాన్ని, విశ్వాసం పురిగొల్పగల ఆశయాల్ని అసందిగ్ధంగా నిర్ణయించుకో గలగాలి.

పార్టీలో భేదాభిప్రాయాలు కలిగి, అచ్యుతపట్వర్ధన్, రామమనోహర లోహియా, అరుణా ఆసఫ్ అలీవంటివారు సమావేశంలో పాల్గొనకపోవడంతో పార్టీ ఏకముఖంగా కృషి చెయ్యదలచినట్లు కనిపిస్తోంది. భేదాభిప్రాయాలు కలిగిన చోట ఒకవర్గం ప్రబలపడ్డం రెండోవర్గం త్యజించడం దృఢసంకల్పాన్ని సూచిస్తున్నది.

పార్టీ కార్యక్రమవివరణలోనూ, ఆశయాల నిర్ణయంలోనూ కొన్ని ముఖ్యమైన మార్పులు వచ్చాయి. ఈమార్పుల్ని బట్టి పార్టీలోని మితవాదవర్గం బలపడిందనీ అతివాదవర్గం అసంతృప్తిచెందిందనీ భావించాలి.

ముఖ్యమైన మార్పులు ఆర్థికపునర్నిర్మాణాశయం, ఉద్యమవిధానం, కార్యక్రమాలలో వచ్చాయి. ఇదివరలో రాష్ట్రాలను భాషాప్రాంతాలప్రకారం విభజించిన రాష్ట్రస్వపరిపాలనా సూత్రాన్నే ఆమోదించారు. రాష్ట్రాలకు అధికఅధికారాలుండాలన్నారు. ఇప్పుడు భాషాప్రయుక్త విభజనసిద్ధాంతం జాతీయైక్యతకు ప్రమాదకరమని పార్టీ చెప్తోంది. పరిపాలనకు రాష్ట్రపరిపాలనావిధానాన్ని సంస్కరించి, జిల్లా పర్యంతం విడగొట్టి, కేంద్రానికి అధికఅధికారాలివ్వాలంటున్నారు. అంటే జిల్లా కలెక్టర్లపైన కేంద్రానికి అధికారం ఉండాలని వీరి అభిప్రాయం. ఆర్థికపునర్నిర్మాణంలో ప్రధానపరిశ్రమలు ప్రభుత్వపరం కావాలనే అంటూ, విదేశాలనుంచి పెట్టు

(39-వ పేజీచూడుడు)



వనమహోత్సవ సందర్భములో వ్యవసాయశాఖామంత్రి కె. యం. మున్షీగారు చేసినవిందుకు భారత రిపబ్లిక్ అధ్యక్షులు రాజేంద్రప్రసాద్, ప్రధాని నెహ్రూగార్లుకూడా హాజరైనారు.




# అభిమానాలు

[కథానిక]

★

శ్రీ వఝ్ఝల రామనరసింహం

శర్మ ఆఫీసునుంచి రాగానే, అతనికి కనిపించిన దేమంటే – టేబిలుమీద కాఫీ ఫ్లాస్కు, పక్కనే ఒక గాజుగ్లాసు. వాకిట్లోని మెట్లమీద కూచుని, సాయంత్రపు చల్లగాలిని అనుభవిస్తూ, రాధ పుస్తకం చదువుకొంటూవున్నది. రోజూవలె ఆమె వచ్చి, గ్లాసులో కాఫీ పోసి, శర్మ కీయలేదు; యీ మదని శర్మకు తెలుసుకూడా.

శర్మ బట్టలు మార్చుకొని. టేబిలువద్దకి వచ్చి, గ్లాసును చేత్తో తీసి, ఏదో రెండు నిమిషా లాలోచించి, మళ్ళీ ఆ గ్లాసును యథాస్థానంలో వుంచేశాడు. ఆతర్వాత, పైమీద కండువా వేసుకొని, వీధిలోకి నడుస్తూ. "వీధితలుపులు తీసివున్నయ్" అని కేక వేశాడు. ఏ గోడకో చెప్తున్నట్లుగా! అతను వెళ్ళిన రెండు నిముషాలకు తలుపులు వేసిన చప్పుడు వినపడ్డది.

శర్మ హోటలులో కాఫీ తాగి, తిన్నగా పార్కుకి వెళ్ళి, అక్కడ ఒక బెంచీమీద కూలబడి దీర్ఘమైన ఆలోచనలో మునిగిపోయాడు.

తనకి పెళ్ళి అయి రెండేళ్లు గడిచింది. పెళ్లి నాటినుంచి కొద్దిరోజులక్రితంవరకు గృహంలో వున్న వాతావరణానికి, ప్రస్తుతపు పరిస్థితికి చాలా భేదం వున్నది. సంసారంగురించి, దాంపత్యజీవనంగురించి తను చాలా పుస్తకాల్లో చదివేడు. విన్నాడు – కాని, మాటపట్టింపుచేత పరిస్థితులు ఎంతవరకైనా వెళ్లుతాయనే విషయాన్ని ఇప్పుడే గ్రహించాడు...రాధను తను ఎంతో ప్రేమించాడు; ఇంకా ప్రేమిస్తున్నాడు; ఆమెను తను స్వయంగా పెళ్లి చేసుకొన్నాడు. ఆమెయందం తన కున్న ప్రేమ నిష్కల్మషమైనది. ఇంత ప్రేమకి బదులుగా తను కోరిం దేమంటే. ఆమె తన అభిప్రాయాలతో ఏకీభవించాలనే. అయితే – రాధకి కూడా తనయం దేమీ తక్కువ ప్రేమ లేదు. ఆమెకి వున్న కోరికకూడా స్వల్పమైనదే – తన భావాలతో తన భర్త ఏకీభవించాలని! తన మాటకి యింట్లో విలువ వుండాలని ఆమెనమ్మకం. తన మాటకికూడా విలువ వుండాలని శర్మ విశ్వాసం...కొద్ది రోజులకిందట తనకీ రాధకీ వాదన వచ్చింది. ఇంతా చేస్తే, అసలువిషయం ఏమీ లేదు. ఇంటిఖర్చువిషయంలో. తను ఒక అభిప్రాయం, రాధ ఒక అభిప్రాయం పెట్టుకొని కూచున్నారు. రాధ తన అభిప్రాయాల్ని, భావాలను త్యాగం చేసి, భర్తతో ఏకీభవించడానికి ఒప్పలేదు; అట్లాగే శర్మ కూడా తన అభిప్రాయాల్ని మార్చుకొనడానికి అతని వ్యక్తిత్వం, పౌరుషం అడ్డువస్తున్నవి! "నామీద మీకు ప్రేమలేదు. నా మాటని ఎప్పుడూ త్రోసిపుచ్చుతారు" అంది రాధ. "నామీద మాత్రం నీకేమైనా అభిమానం కొని, నామాటయందు గౌరవంకాని వున్నాయా? నిజం చెప్పు!" అన్నాడు శర్మ. అంతే! ఆవిషయం నేటికీ తేలలేదు!

మరోమారు, ఏదో సినిమాగురించి ప్రస్తావన వచ్చింది. శర్మ సినీమా బాగులేదన్నాడు. రాధ "నాకు నచ్చింది" అని అమాయకంగా అన్నది. "ఔను! నాకు బాగులేదు కాబట్టి

నీవు తప్పక నచ్చుతుంది అనే అనుకొన్నాను" అన్నాడు శర్మ!

"నా అభిప్రాయం చెప్పుకోవడంకూడా నేరమేనా?" అంది రాధ.

"అది అభిప్రాయం కాదు. నా మాటని కాదనడం!"

"అంటే, నామాటల్లో మీకు ఏమీ విశ్వాసం లేదన్నమాట!"

నిజంగా, రాధమాటల్లో తనకి విశ్వాసం గౌరవం లేవా? అనుకొన్నాడు శర్మ. వున్నదనే తను అనుకొంటున్నాడు; కాని, లేదంటుంది రాధ. ఏది నిజం? ఈ పరస్పరఅనుమానాలకి, అపనమ్మకాలకి మూలకారణం ఏమిటి?... ఇదంతా అయోమయంగా వున్నది. ఈ ఆలోచనలకి అంతు లేదు... రెండుఅరచేతుల్లోను బుర్ర పెట్టుకుని, శర్మ యింకా ఆలోచిస్తూనే వున్నాడు...రాత్రి అయిపోయింది. పార్కులో ఎవరూ లేరు.. శర్మ దిగ్గున లేచి, రిస్టువాచీవైపు ఓమారు చూసుకొని, తొందరగా, ఇంటివేపు నడిచాడు.

ఇంటితలుపులు తీసేవున్నవి. టేబిలుమీద దీపం వెలుగుతూవున్నది. అంతవరకూ నేలమీద పడుకొని చదువుకొంటూ వున్న రాధ, శర్మ వచ్చేసరికి లేచి కూచుంది. శర్మ ఒట్టలు మార్చి, పడకకుర్చీలో కూచున్నాడు. "చాలా ఆలస్యమైంది. ఇంక భోజనానికి లేవండి" అని రాధ అంటుందని శర్మ నిరీక్షిస్తున్నాడు. కాని, ఆమె ఏమీ అనలేదు – నిజానికి, రాధకి చాలా ఆకలిగా వుంది. భర్త రాకపోవడంమూలాన తను యింతవరకూ భోజనం చేయలేదు.

"రాధా! నేను రావడం చాలా ఆలస్యమైంది. నువ్వు వేగిరం భోజనం చేసేవలసింది" అని శర్మ తనని లాలిస్తాడని రాధ ఆశించింది – కాని, అతడు మౌనంగా కూచున్నాడు.

పావుగంట గడిచింది. ఎవరు మాటలాడలేదు. రాధకు లోనుంచి దుఃఖం వుబికివస్తున్నది. తనకి భర్తవల్ల తీరని అన్యాయం జరుగుతున్నట్లుగా వుంది. ఇంతసేపయి తనతో ఒక్క మాటయినా అనడానికి అతనికి కష్టంగా వుంది. తనకి ఎంత ఆకలిగా వుందో – అంతకంటె, ఎంత దుఃఖంగా వుందో, అతనికేమీ అవసరం లేకపోయింది. తనమీద అతనికి ఏమాత్రమూ జాలి లేదు; ప్రేమ లేదు. తనను యిన్నాళ్లూ ప్రేమిస్తూ వున్నాడనుకొన్న భర్త యింత కఠినుడని తను అనుకోలేదు. ఇంటికి వచ్చి యింతసేపయినా తనతో ఒక్కమాటయినా ఆడలేదు. ఒక్కమారు తనను పలకరిస్తే తను ఎంతగా సంతోషించేది!

శర్మ ఆలోచనలు కూడా యిదేవిధంగా వున్నవని వేరే చెప్పనక్కరలేదు! రాధనుంచి మొదటి మాట వస్తుందని అతను ఆశిస్తున్నాడు. కాని ఆమె పెంకెగా వూరుకొన్నది. తనే మొదట మాట్లాడాలని శాస్త్రం ఏమిటి? అదీ కాక, మొదట మాట్లాడినవారు "ఓటమి"ని ఒప్పుకొన్నట్లు అని అతని వుద్దేశం!...శర్మకు విసుగు జనించింది. దిగ్గున లేచి, పక్క వేసుకుంటున్నాడు. రాధ పరిస్థితిని గమనించింది.

"మళ్ళీ ఎక్కడకు వెళ్లిపోతున్నారు?"

"........ఏం?........"

"భోజనం చెయ్యకుండా వెళ్లిపోతారా?"

"భోజనానికి లెమ్మని నువ్వు చెప్పేవా?"

"మీరు అడుగుతే నేను భోజనం పెట్టనూ?"

"అంటే, నువ్వు యివాళనుండి నన్ను భోజనానికి లెమ్మనమని పిలవ్వు అని అర్థమా?"

"నేను ఆవిధంగా అన్నానా?"

"అయితే మరి ఎందుకు పిలవలేదు?"

"భోజనానికి రావద్దని నేను అన్నానా?"

"రమ్మనమని పిలవలేదు కదా!"

"మీరు వస్తారని చెప్పేరా మరి?"

"రానని చెప్పేనా?"

"నేను వద్దు అనలేదు కూడా...పోనీ, యిప్పుడైనా రండి"

శర్మ భోజనం వేగిరం ముగించి, వెంటనే డాబామీదకు పోయి పడుకున్నాడు. అయిదునిముషాలతర్వాత రాధకూడా వచ్చి, అతని పక్కనే చాపవేసికొని పడుకొంది.

గంట గడిచింది. పోలీసుటాణాలో కొట్టిన గంటలు 11 వినిపించినవి. ఇంతసేపూ ఇద్దరూ మౌనంగానే వున్నారు. శర్మ పక్కకు తిరిగి, రాధతో అన్నాడు.

"రాధా! నువ్వు భోజనం ఎప్పుడు చేస్తావు?" తను భోజనం చేయకుండా పడుకున్నదన్న సంగతి భర్తకి ఏట్లా తెలిసిందా అని ఆశ్చర్యపోతూ, రాధ అంది:

"నాకు ఆకలిగా లేదు యివాళ"

"రాధా! నువ్వు నిజం చెప్తున్నావా?"

"...నా ఆకలి చచ్చిపోయింది"

"అందుకు నేనే కారణ మంటావు?"

"నేను అల్లాగేమీ అనలేదు"

"కాని, నీ వుద్దేశం అదే! నీ తప్పుకీ, నా తప్పుకీ కూడా శిక్ష అనుభవించేది నేనే"

"మీరు తప్పుచేశారని నేను అనలేదు. నేను చేసిన తప్పులు ఏమిటో దేముడికే తెలియాలి"

నీకేదో దురన్యాయం జరుగుతున్నదనుకొని, అలిగి తిండి తినడం మానేస్తావు. నేను కూడా ఆవిధంగా చెయ్యలేకనా? కాని అది వృత్తి తెలివితక్కువపని – అయితే, నీ తెలివితక్కువకికూడా నేనే బాధపడాల్సి వస్తూంది."

"ఎంతలేసి కఠినమైన మాట లంటూవున్నారో మీకు తెలుసునా? పోనీండి, యింకా ఏడిపించండి. అసలే అన్నం తినలేదు. ఆకలిమీద వున్నదాన్ని ఏడిపించండి"

"ఆకలి చచ్చిపోయిందన్నావుగా, ఒక నిముషం కిందటే? ఇంతలోనే ఆకలి పుట్టుకొచ్చిందా?"

ఈ ఆక్షేపణకి రాధ నిలవలేకపోయింది. ఒక్కమారుగా దుఃఖం వచ్చి, వెక్కివెక్కి ఏడవడం మొదలుపెట్టింది. రాధను చూసి, శర్మకి నిజంగా జాలికలిగింది. ఆమెను తన దగ్గరగా తీసుకుని వూరడిద్దామన్న కోరిక కూడా కలిగింది. అతను లేచి, రాధవేపు తిరిగాడు. కాని, మళ్లీ వెంటనే పడుకున్నాడు.

మర్నాడు సాయంత్రం, శర్మ అఫీసునుంచి వచ్చేటప్పుడు, ఒక మంచిసిల్కుజాకెట్టు కొనితెచ్చాడు. రాధకు దానినిస్తూ "రాధా! నీకు మంచి సిల్కుజాకెట్టు తెచ్చాను. చూడు!" అని ఆమెవైపు చూసి, చిరునవ్వు నవ్వేడు. రాధ నవ్వలేదు. జాకట్టు తీసికొని, యింట్లోకి వెళ్లిపోయింది.

ఆనాడు రాత్రి ఆమె ఆజాకెటును వేసుకోలేదు. కొత్తబట్టలలో ఆమెను చూసి ఆనందించడం శర్మకి అలవాటు అని ఆమెకు తెలుసు. రాధ కొత్తచీర కట్టినప్పుడు "రాధా! ఈ చీరతో నువ్వు ఎంత చక్కగా వున్నావు?" అని శర్మ మునుపు అంటూ వుండేవాడు......

రాత్రి పడుకునేముందర శర్మ రాధతో అన్నాడు:–

"రాధా! జాకెట్టు వేసుకోలేదేమీ?"

"ఏమీ లేదు.. ..."

"వేసుకోడం యిష్టం లేదా?"

"ఎందుకు లేదండీ"

"రాధా! నిజం చెప్తున్నాను! నీమీద అభిమానంకొద్దీ ఆజాకెట్టు యివాళ కొన్నాను.

నువ్వు వేసుకుంటే చూసి సంతోషిద్దామనే తెచ్చాను – ఇది నీకు తెలుసునుకూడా…"

రాధ మాట్లాడలేదు. మౌనంగా ఆకాశం వైపు చూస్తూ పడుకున్నది.

అయిదురోజులు గడిచాయి. ఆనాడు సాయంత్రం శర్మ ఆఫీసునుంచి వచ్చాడు; రాధ చక్కగా ముస్తాబై, చిరునవ్వుతో, అతనికెదురుగా వచ్చింది. ఆనాడు ఆమె కొత్తసిల్కుజాకెట్టు వేసుకొంది.

రాధ కాఫీ యిస్తూ, శర్మకి దగ్గరగా వచ్చి నుంచుంది. శర్మ ఆమెజాకెట్టువైపు చూడలేదు. శర్మకి జాకెట్టు కనిపించేలా జాకెట్టు చేతులను సద్దుకుంటూ, రాధ అంది

"అట్లా వున్నారేం? తలనొప్పిగా వుందా?"

"వూఁ కొంచం నొప్పిగానే వుంది" అన్నాడు శర్మ పక్కకి చూస్తూ.

"కొంచం తలరాయనా? నొప్పి తగ్గుతుందేమో" అని రాధ శర్మకి దగ్గరగా వచ్చింది. నిజానికి శర్మదృష్టిలో తను వేసుకున్న జాకెట్టు పడాలనీ, అతడు తనను మెచ్చుకోవాలనీ. రాధ అట్లా చేసింది. కాని, శర్మ మరింతపక్కకి దృష్టి మరల్చుకుంటున్నాడు.

"వద్దు! తల రాయక్కర్లేదు"

"ఏమి ?"

"కొంచం ఆఫీసుకాగితాలు రాసుకోవలసిన పని వుంది"

రాధ ఓ నిముషం ఆలోచించి అన్నది:

"కొత్త జాకెట్టు వేసుకున్నాను చూడండి."

"జాకెట్టు మంచి బావుంది. నీ వంటిరంగుకి ఇది ఎంతో చక్కగా వుంది" అని శర్మ అంటాడని రాధ అనుకుంది; కాని, అతడు ఆమెవేపేనా చూడకుండా, "ఊఁ" అన్నాడు.

రాధకి చాలా ఆశాభంగమైంది:

'బావుందా?' అంది మెల్లగా.

"బావుందో లేదో నీకు తెలియాలి కాని నాకెట్లా తెలుస్తుంది? నేను వేసుకోలేదు కదా!"

"వేసుకున్నారని అన్నానా? ఇంతకు మునుపు ఎప్పుడూ మీరు కొత్తబట్టల బాగోగులగురించి చెప్పేవారు కనక నే అడిగేను – లేకపోతే అడగకేపోదును"

"ఇంతకు మునుపు బుద్ధిగడ్డితిని అనేవాడిని – ఇకనుంచీ మరి అన్నతే"

'ఈపాటిదానికి అంతకోపం ఎందుకూ? ఇష్టం లేకపోతే అవిధంగా చెప్పేయండి"

"ఎవరికి యిష్టం లేకపోతే ముచ్చటపడి ఆ వేళ జాకెట్ వేసుకోమంటే వేసుకున్నావా? లేదే! ఇప్పుడు చెప్పు ఎవరికి యిష్టం లేదో"

"ఆవేళ వేసుకోలేదన్నంత మాత్రాన నాకిష్టం లేదనిస్నీ నింద వేశారన్నమాట. అంతే కాదా?"

"నువ్వు కూడా, అంత చిన్నకారణం చేతనే నా కిష్టంలేదని నిర్ణయించివేశావు కదా?"

రాధకి ఏమి మాట్లాడాలో మరి తెలియలేదు. అయిదునిముషాలు మౌనంగా వుండిపోని, తనలో తను అనుకుంటున్నట్లుగా, గద్గదస్వరంతో అన్నది:

"ఇవాళ వుదయంనుంచీ అనుకుంటూనే వున్నాను, ఏదో వాదన యిట్లా వస్తుందనే"

"అంతదూరదృష్టి వున్నదానవు నాదగ్గరకు పని కట్టుకుని వచ్చి జాకెట్టు బాగోగుల గురించి ఎందుకు వేధించుకుతిన్నావూ?"

రాధ త్రుళ్ళిపడినట్లయింది:

"మిమ్మల్ని వేధించుకుతిన్నావా? సరే లెండి. ఇకముం దెప్పుడూ అలాంటిసేకం చేయను లెండి" అని, రాధ గిరుక్కున తిరిగి ఇంట్లోకి పోయింది.

ఆనాడు రాత్రి శర్మ భోజనం చేస్తూవుండగా, రాధ అన్నది:

"మావూరికి టిక్కట్టు ఎంతవుతుంది?" శర్మ ఇంకా అట్లా తలవంచుకునే భోజనం చేస్తూ, మెల్లిగా అన్నాడు:–

"మీవూరు ఈపక్కస్టేషనే కదూ. మనిషి అయితే, రైలుమీద పావలా అవుతుంది; బస్సుమీద అరణాలు! అంతకంటే ఎచ్చువదు"

రాధ ఏదో ఆలోచించసాగింది. శర్మ యింకా, అట్లాగే తలవంచుకుని, భోంచేస్తున్నాడు. ఒకరివైపు ఒకరు చూస్తున్నట్టుగా లేదు.. ...రాధకి ఏదో టక్కున జ్ఞాపకం వచ్చినట్లుగా, అడిగింది:

'మీదగ్గిర ఒక రూపాయి వుంటే యివ్వగలరా? బస్సుకి అరణాలు పోను, మిగతాది ఏదేనా దోవఖర్చుకి వుంటుంది"

"నా షర్టుజేబులో రెండురూపాయల నోటు వుంది; తీసుకో" అన్నాడు శర్మ, యింకా తలవంచుకునే. రాధ మాట్లాడలేదు. ఆమె పెద్దకళ్లలో ఏదో ఆశ్చర్యం, బాధ, విచారం—అన్నీ విచిత్రమైనట్లు కన్పిస్తున్నది. తను భర్తతో ఏమి మాట్లాడిందో తనకే తెలియనట్లుంది. ఆ మాట్లాడినంతసేపూ తను ఏదో మనుషులతో, మత్తులో మాట్లాడినట్లుగా, ఇంక తనను ఆమత్తు వదలనట్లుగా కనిపిస్తున్నది...

శర్మ పళ్లెంలో చేయి కడుక్కొని, లేచి వెళ్లిపోతూవుండగా, రాధ "ఏమండీ" అని పిలిచింది. శర్మ ఆగి, వెనుతిరిగి, "ఏమిటి" అన్నాడు.

రాధ తలవంచుకోని, నేలమీద కాలిబొటనవ్రేలు రాస్తూ, మెల్లిగా అంది:–

"అయితే...అంతే నన్నమాట?..."

"ఏమిటి 'అంతేనన్నమాట'? నాకు ఏమీ బోధపడలేదు" అన్నాడు శర్మ.

"నేను మావూరు వెళ్లిపోవడం.. అంటే ...వెళ్లిపోతే...కాదు. కాదు – నేను వెళ్లిపోవడమే మీకోరిక అన్నమాట?"

"ఇదుగో, రాధా! వెళ్లి మరోకనిందను నామీద వేస్తున్నావు. నిన్ను వెళ్లిపొమ్మని నేనింతవరకూ అన్నానా? నిజం చెప్పు! నీ అంతట నీవే, మీ వూరికి టిక్కట్టెంతని అడిగావు; చెప్పేను. డబ్బు అడిగావు – తీసుకోమన్నాను. ఇందులో నా తప్పేమైనా వుందా?"

రాధ తలఎత్తి, శర్మముఖంలోకి తీక్షణంగా చూసింది. అతనికి ఏమి జవాబివ్వాలో

(36-వ పేజీ చూడుడు)

# రష్యా ప్రపంచయుద్ధం ఆశిస్తుందా?

జార్జి కెన్నన్ అమెరికన్ విదేశాంగ శాఖలో ప్లానింగ్ ముఖ్యుడుగా 23 ఏండ్లు పనిచేశాడు. రష్యాకు ప్రతిగా ప్రచ్ఛన్నయుద్ధం ఎల్లా చేయాలో ఆ ప్రణాళికఅంతా ఆయనే తయారుచేశాడు. ఏతత్కారణం చేత "యూరప్ పునరుద్ధరణ ప్రణాళిక"కు కూడా మూలపురుషులలో ఒకడయ్యాడు. "రష్యాతో యుద్ధం తప్పదా" అంటూ ఒక వ్యాసం రీడర్స్ డైజెస్టులో వ్రాశాడు. ప్రపంచక్షేమం యోచించి ఆ వ్యాసం, ఎల్లరూ స్వేచ్ఛగ ప్రకటించి ప్రచారం చేయవచ్చునని డైజెస్టు ఔదార్యం చూపించింది. యుద్ధంకేసి కాక శాంతివైపుకే త్రాసు మొగ్గుతుం దనటానికి ఆయన ఐదు బలీయకారణాలంటూ చూపించాడు. వ్యాస సారాంశం క్రింద పొందుపరుస్తున్నాము.

## 'రష్యా అమెరికాతో యుద్ధం చేయ కృషిచేస్తున్నదా'?

న్యాయానికి ఈప్రశ్నకు సోవియట్ అగ్రనాయకులు తప్ప ఎవరూ రూఢిగా జవాబు చెప్పలేరు. లెనిన్ ఒకప్పుడు. "సోవియట్ రిపబ్లిక్, సామ్రాజ్యదేశాలతో, ఇరుగుపొరుగున ఎక్కువకాలం బ్రతకటం అసంభవము. రెండింట్లో ఏదో ఒకటి రెండో దాన్ని జయించకతప్పదు. ఈలోపల ఇద్దరిమధ్యా కొట్లాటలూ తప్పవు"అని చెప్పాడు. కమ్యూనిస్టులు ఈనాటికీ ఈ విషయం ఒప్పుకుంటూనే ఉంటారు. అయితే, స్టాలిన్, ప్రస్తుతసిద్ధాంతాలలో యుద్ధకాంక్ష కనబడదు, పైపెచ్చు, కాపిటలిజమ్ లో అంతరంగికంగా బయలుదేరిన అవకతవకల బరువుకే కేపిటలిజం స్వయంగా చితికి జీర్ణమయిపోతుందని కమ్యూనిస్టుల నమ్మకము. ఈపరిణామంలో, సోషలిస్టు సంఘజననసమయానికి కమ్యూనిస్టులు కేవలం మంత్రసానితనం వహిస్తే చాలనీ, అపనికూడా, ఏదేశానికా దేశంలోఉన్న కమ్యూనిస్టులు తప్ప సోవియట్ ఎట్టిసైన్యాలు కలుగజేసుకో నవసరంలేదనీ కూడా వారి నమ్మకం.

ప్రపంచంలో కేపిటలిజం రూపుమాపేందుకు స్వయంగా సోవియట్ సైన్యాలు దండెత్తి వెళ్ళవలసిన అగత్యం స్టాలినిస్టు సిద్ధాంతంలో లేదు. పైగా అల్లాచేస్తే, కేపిటలిజం తన బరువుకు తానే కృంగిపోగలదనే అనన్యసత్యానికి విరుద్ధము, అవిశ్వాస్యప్రకటన అవుతుంది

ఇది సిద్ధాంతం సరే; కాని రష్యన్ సంప్రదాయం ఎల్లా ఉంది? కమ్యూనిజం రష్యాను మార్చలేదుగాని, రష్యాయే కమ్యూనిజంను మార్చిందని, రష్యనులతో పరిచయమున్న ప్రతివారికీ తెలుసు.

రష్యన్‌చరిత్ర రాజ్యవిస్తరణచరిత్ర. అయితే దండయాత్రల చరిత్రగాదు. అనుపాను తెలిసి, అవసరమైనంతకాలం ఆగి,

**జార్జి కెన్నన్**

అవకాశం రాగానే,అట్టే అపద లేకుండా, చలాకీగా, దొంగచాటుగా, ఇట్టే సరిహద్దులను విస్తరించుకున్న చరిత్ర. ఫిన్నిష్, యుద్ధంలాంటి ఘట్టాలు, ఈ సూత్రానికి అపవాదులయాయంటే, కాస్త తప్పులెఖ్ఖలతో బయలుదేరినందువల్ల అయాయి.

అతివిస్తృతదేశము ఉండటంవల్లనేమి, నైసర్గికస్థితివల్లనేమి రష్యనులకు భూమిమీద దృష్టిఎక్కువ. తమకున్న భూమి, సరిహద్దులూ, దేశానికి ఇరుగుపొరుగుననున్న భూములూ, వీటిమీదే వాళ్ల దృష్టి కేంద్రీకరించబడి ఉంటుంది. టెక్నికల్‌గానూ ఆర్థికంగానూ వెనుకబడిఉండటంచేత, భూమినలువైపులా చొచ్చుకుపోకుండా కాస్త ఆగారు. పూర్వరష్యన్ సామ్రాట్టులు, జాగ్రత్తగా కాస్త కాస్తే అంచులు కొరికి కబళిస్తూ, జీర్ణం అవుతుందో లేదో అంచనా వేసుకొంటూ, రష్యన్ ప్రభుత్వాంగానికి భూమి ఎక్కువై అజీర్ణం కాకుండా మాత్రం జాగ్రత్తపడ్డారు. కాని సోవియట్ సామ్రాట్టులు—ప్రస్తుతం తూర్పు యూరప్‌లోని ఉపగ్రహాలవిధానం చూస్తే—ఈ జాగ్రత్త చూచుకోకుండా, ఆరగించుకోలేకుండా మింగినట్లు కనబడుతుంది. ఈ అజీర్ణంమీదే, ఇంకా భూమి స్వాధీనపరచుకొనేందుకు ఇంకా పెద్ద ఖండాలు కబళించేందుకు, సోవియట్ నాయకులు ఆత్రం చూపించే స్థితి లేదు. ఇల్లాంటప్పుడు, తమ అంతరంగిక క్షేమ దృష్ట్యైనా, సోవియట్ నాయకులు ప్రపంచయుద్ధం కోరరు.

రష్యాపాల్గొన్న గత మహాయుద్ధం జరిగి ఐదేళ్ళైనా కాలేదు. ఆయుద్ధంలో రష్యా భీభత్సంగా దెబ్బతిన్నది. ఎంతపుంజుకొన్నా దేశం పూర్తిగా తేరుకోవాలంటే చాలా సంవత్సరాలు పట్టకతప్పదు. పారిశ్రామికాభివృద్ధికి, దృఢమైన ప్రణాళికలతో, పని సాగించుకొంటోంది. ఈపని కొన్ని ఏళ్లు పట్టవచ్చును. ఈమధ్యలో అభ్యంతరాలు కోరి తెచ్చికోరు. యుద్ధం అంటే ఈపనంతా పాడయిపోయింది.

ఇన్ని చిక్కులతో రష్యా ప్రపంచ యుద్ధం తలపెట్టుందని తోచదు.

## ఇప్పుడు రష్యా అటంబాంబు తయారు చేసిఉంటే ఏమవుతుంది?

ఆటంబాంబు తయారుచేసినందువల్లా, రష్యన్ విధానం ఏమంత మారదు. అసలు ఆటంబాంబు తయారుచేయటం, చాలా వ్యయప్రయాసలతో కూడినపని. అందుకు కావలసిన ముడిసరుకు ఇంకా అంత విరివిగా అందటంలేదు.

అదీ కాక పెద్దపెద్ద పారిశ్రామికదేశాలను పూర్తిగా చితగొట్టి వాళ్ళు కాళ్లు జేరాని కొచ్చేట్టు చెయ్యాలంటే చాలాఅటంబాంబులు కావాలి. రష్యాకు అన్ని లేవు.

"ఆటంబాంబు కొందరు రాజకీయజ్ఞులనుకొన్నంతగా రాజకీయమహాస్త్రం కాదు. పిరికిపందలను బెదరగొట్టేందుకు పనికిరావచ్చునేమోగాని యుద్ధఫలితం రూపించేం

దుకు ప్రయోజనకారి కాదు" అని 1946 లో స్టాలిన్ అన్నాడు. స్టాలిన్ ఈ అభిప్రాయం మార్చుకొన్నట్టు, ఏమీ దృష్టాంతాలు లేవు.

అదీ కాకుండా, అటంబాంబు వాడే వాళ్ళు, ఎదుటివాని బాంబుల ఎదురుదెబ్బ కూడా ఆలోచించుకోవాలి. దేశపారిశ్రామిక శక్తిని సమూలంగా నాశనం చేయలేక పోయినా, దేశనాగరికతను, పట్టణాలనుశత్రువుల ఆటంబాంబు ధ్వంసంచేస్తుంది. ఈ శత్రువును ప్రేరేపించటానికి తమ ప్రభుత్వమే కాలుదువ్వి తమపై ఈ బెడదతెచ్చేదయితే, ప్రజలకు ఆ ప్రభుత్వంమీద ఆదరణ మిగలటం కష్టం. తర్వాతి ఫలితాలూ అల్లాగే ఉంటాయి.

వెనకటిరోజుల్లో యుద్ధాలు ప్రారంభించిన రాజ్యాలు, తమ రాజ్యం ఎక్కువ దెబ్బతినకుండా బైటపడగలదనే నమ్మకంవల్లే ప్రారంభించేవారు. అప్పటి యుద్ధపరికరాలు, యుద్ధవ్యూహవిధానాలను బట్టి, నిజంగా కాస్త బలం ఎక్కువ ఉంటే, ఎటుపోయి ఎటువచ్చినా, స్వదేశం దబ్బతిని పోకుండానేం, యుద్ధంలోంచి బైటపడే వీలూ ఉండేది. కాని ఈనాటి యుద్ధం అల్లా ప్రత్యేకసైనికరంగాలతో కుంచితమై ఉండదు. సైనికులు, ప్రజలు పరిశ్రమలూ, పట్టణాలూ, దేశం యావత్తూ ఈబాంబుల ముందు చితికిపోకతప్పదు. ఎంతో వృద్ధిచేసుకోవలసిన భారీపరిశ్రమలను పారిశ్రామిక ప్రణాళికలను సాగించుకొంటూ, క్రెమ్లిన్ నాయకులు ఇల్లా నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తారనుకోడం, అమాయకత్వం.

మానవస్వభావంలోని లోపాలవల్ల, యుద్ధానికిసర్వత్రా ఉండే అవకాశం ఆటంయుగంలోనూఅంతా ఉంది. కానిఅటంబాంబు తయారయాక యుగం హత్యాకాండ గాక ఆత్మహత్యాకాండకూడ అయే అధికప్రమాదం ఉంది. క్రెమ్లిన్ నాయకులు, హిట్లర్ జపానీస్‌లవలె, అనవసరంగా ప్రాణాలకు తెగించినరకం వారుకారు.

## యుద్ధం సంభవమా?

ఇల్లాంటి ప్రపంచం ఉన్నంతవరకూ యుద్ధం ఎప్పుడైనా సంభవమనే మన ఊహల్లోకి రాక తప్పదు. "యుద్ధంకాని శాంతికాని కేవలం మన కోరికమీదే ఆధారపడి సంభవించవు. మన మెంత శాంత్యపేక్షతో, ఆకారహీనంగా నిలచినా, ఇతరులలోనూ అంతటిశాంత్యపేక్షా, దురాక్రమణవాంఛ ఉండవని చెప్పలేము" అని అలెగ్జాండరు హామిల్టన్ వ్రాశాడు.

యుద్ధం రావచ్చునా అనేందుకు మూడు ముఖ్యకారణాలు ఉన్నాయి.

(1) యుద్ధం రెండుపక్షాలు కోరుకోకపోయినా, ప్రమాదవశాత్తూహటాత్తుగా సంభవించవచ్చును. భవిష్యద్భీతి, ఆత్మగౌరవాలు. చుట్టూ యుద్ధపరికరాలు పెరిగిపోతుంటే కలిగే అలజడి, కట్ల పెటినట్లైనా దేశాలు యుద్ధరంగంలోకి కాలుజారినట్లు జారిపోవచ్చును. ఈనాడు ప్రజలు యుద్ధభీతి త్సేలు రుచిచూచారు. కొస్తనిద్రాతసాలు కూడా వచ్చాయి. చిల్లరసంఘటనలకు చిలిపికజ్జాలకూ ఈనాడు తావిచ్చే స్థితిలో లేరు. 1938 లో రష్యనులూ, జపానీయులు, విమానాలతోనూటాంకులతోనూ,ఒక పూర్తియుద్ధం ఒక చోట జరిపారు. కాని ఉభయప్రభుత్వాల పత్రికలలోనూ, ఈ విషయం చూచాయనైనా ప్రకటితం కాలేదు. ప్రజాస్వాతంత్రదేశాలకు ఈపద్ధతి తెలియక పోయినా, ఇప్పుడు వాళ్ళూ అవసరాన్నిబట్టి కొంత నిద్దాతనం అలవర్చుకోగలుగుతున్నారు. జర్మనీ ఆస్ట్రియాలలో, అమెరికన్ రష్యన్ సైన్యాలు, అంతదగ్గిరలో ఉండటంవల్ల సంఘటనలకు కొరత ఉంటుందనుకో నక్కరలేదు.

(2) తమ మీదికి ఎవరో దండెత్తిరాబోతున్నారన్న భయం తో, రష్యాయుండే, యుద్ధం ప్రారంభించవచ్చును.

ఇతరులమీద దండెత్తవచ్చునని, రష్యన్ సిద్ధాంతం చెప్పకపోయినా, ఇతరులు తమమీదికి త్వరలో దండెత్తిరారని కూడా చెప్పదు. రష్యన్ సాధికారసిద్ధాంతంప్రకారం, కమ్యూనిస్టేతర దేశాలే, సోవియట్ యూనియన్‌పై యుద్ధానికి ఉవ్విళ్లూరుతున్నాయనీ, కానీ దేశదేశాల ప్రపంచ ప్రజల సానుభూతి రష్యాపైనుండబట్టి వాళ్లచేతులు కట్టబడ్డాయనీ, కాపిటలిస్టు దేశాలలో ప్రపంచవిప్లవం రాకపోతే, రష్యామీదికి అవి దండెత్తిరావచ్చుననీ చెప్పతూంది.

ఇదికేవలం అర్థం లేనిమాట అనిపించినా, నిర్లక్ష్యంగా తోసెయ్యదగ్గది కాదు. నియంతృదేశాల ఆత్మవంచనావిధానమే ఇది. ఆదేశాల ప్రజలకు తెలిసేవార్తలు, ఆదేశాలనుంచి రానిచ్చేవార్తలు, ఈ రంగుపూతలకే నియమితమై ఉంటాయి. అమాటలేవింటూన్న ప్రజలవిషయం, మనం అంచనా వెయ్యవలసింది.

ప్రపంచం తమకు శత్రువని ద్రోహబుద్ధితో తమని పడగొట్టనున్నదనీ ప్రచారం సాగిస్తే తప్ప,రష్యన్ నియంతృ ప్రభుత్వం, తన రహస్యపోలీసువిధానాలను సమర్థనీయంగా పొడిగించుకోటం కష్టం. కేపిటలిస్టు దేశాలు తమను హతమార్చపోతున్నాయని దృఢ విశ్వాసం ప్రజలకు కల్పించి ప్రభుత్వం కల్పించుకున్నాక, ముందు దెబ్బతీసేందుకు యుద్ధం ప్రారంభించినా ఆశ్చర్యం లేదు.

(3) భవిష్యత్తును గురించిన ఏఅంచనా 'తప్పనిసరి' అనేందుకు వీలులేదు. ఆకారణంచేత యుద్ధం రాదని నేను ఇన్నికారణాలు చూపినా యుద్ధం వస్తే రావచ్చును.

కాబట్టి "వస్తేరావచ్చును" అనే మాట ఒకటే ఆలాఉంచి, 'ఇంతలో' తప్పకుండా వస్తుంది, 'అంతలో' తప్పకుండా వస్తుంది అని అంటానికి సహేతుకమైన కారణాలు లేవు.

## కమ్యూనిజం అరికట్టేందుకు అమెరికా ఏమి చెయ్యాలి?

మన విదేశాంగనీతిలో, యుద్ధభీతివల్ల వచ్చే నీరసత్వాన్ని తొలగించుకోవాలి. అంతర్జాతీయసమస్యల పరిష్కారంలో మన విధానాలు ధైర్యస్థైర్యాలతో కూడుకొని ఉండాలి. యుద్ధం అవసరంలేకుండా ఉన్న పరిష్కార మార్గాలన్నీ వెదకాలి.

అమెరికా నడిగడ్డమీదే సరాసరి యుద్ధానికి రష్యాదిగుతుందని కొందరు అనుకొంటున్నారు, కానీ మన భద్రత భేదించేందుకు ఇది ఒక్కటే మార్గంకాదు. కేవలం యుద్ధం ఒక్కటే మినహాగా, సోవియట్ రష్యా ఆసియా యూరప్‌ఖండాలలోని కమ్యూనిస్టు కానిదేశాలను కమ్యూనిస్టు దేశాలుగా మార్చుకొంటూవచ్చేస్తే, అదే, అమెరికా

(35-వ పేజీ చూడుడు)

నవల:

# రుద్రమదేవి

శ్రీ నోరి నరసింహశాస్త్రి

౩౯

ఆనాటి గొంటూరు చిన్న పట్టణము. ఆ పట్టణమంతయు ఎఱ్ఱచెరు వను నొక పెద్దచెరువుకు తూర్పుననే ఉన్నది. అందులో నొక కోట కలదు. అది మట్టికోటయే కాని రాతికంటెను కఠినమైన మట్టి. ఆ మట్టిలో కలిపిన పాళ్లు, దానితో సిద్ధముచేసిన పాకము ఆ కోట కట్టిన ప్రధానశిల్పులకు వంశానుక్రమముగా వచ్చుచుండిన రహస్యము! పనివారిచేతనే వారా పనియంతయు చేయింతురు గాని యా రహస్యమితరులకు తెలియనీయరు. ఆ కోటగోడలకు ఆ ఎఱ్ఱచెఱువునీరేగాని, ఒక్కచుక్కయైనను వేరునీరు వాడ లేదు. ఆ కోటయగడ్తకు గూడ ఆ ఎఱ్ఱచెరువునీరే పెట్టుచుండెడి వారు! కోటలో నున్న జలాశయములకు గూడ నీ యెఱ్ఱచెరువునీరె వెళ్లుచుండెబోలును! గొంటూరునకు వాయవ్యభాగమున నంతయు నెఱ్ఱనేల. ఆ ఎఱ్ఱనేలగుండ ప్రక్కలకొండలపై వర్షించిన నీరు ప్రవహించి వచ్చుటచే, రాగివలె నెఱ్ఱనై అందులో కలియుటచే దానికి ఎఱ్ఱచెరువను పేరు వచ్చినది. రాగివంటి ఎఱ్ఱనేలనుండి ప్రవహించు నీటిప్రభావము ఎరిగియున్నందుననే కావచ్చు, రాజమహేంద్రవరము ఇత్యాదిప్రదేశములలో గూడ, నిట్టి మట్టి కోటలే కట్టియుండిరి.

ఎఱ్ఱచెరువుకు పశ్చిమమున పెద్ద యరణ్యము కలదు. అందులో ననాదిగా ఇతరవృక్షములతోపాటు పెద్ద టేకువ్రానులు కూడ పెరుగుచుండెను. టేకుచెట్ల యాకులు నలిపినచో చేతు లెఱ్ఱ పడును. అది గ్రహించినశిల్పులు ఆ యాకులు సేకరించి చిత్రకారుల కళాపరమగు వర్ణము లెన్నియో కల్పించెడివారు. ఆ టేకుకలపకూడ శ్రేష్ఠమై యెన్నియో విధముల దారుశిల్పాదులకు వారి కుపయోగ పడుచుండెను. అందుచే గొంటూరు శిల్పులకును చిత్రకారులకును ఆవాసమయ్యెను. టేకుశబ్దమునకు రూపాంతర మగు తేకునుండియే తేకు శబ్దము కూడ బుట్టినది. గొంటూరిశిల్పులకు తేకువకూడ విశేషము!

ఎఱ్ఱచెరువుకు నీరువచ్చు కొండకాలువ వానుకొని, యా యడవిలో కొంతకాలముగా బాబాజీల మఠమొకటి వెలసెను. గౌడదేశమునుండి వచ్చిన వైష్ణవబ్రాహ్మణులకు బాబాజీలనియు, వారి మఠములకు బాబాజీమఠములనియు నాంధ్రదేశములో పేరు వెలసినది. ఆ మఠములలోని పెద్దలను శిష్యులు 'బాబాజీ' యని వారి భాషలో గౌరవార్థముగా సంబోధించుటచేతను నిర్దేశించుట చేతనే ఆ పేళ్లు కలిగినవని తోచును. గణపతిదేవులయు రుద్రమ దేవులయు రాజగురువు లగు విశ్వేశ్వరశంభుదేశికులు గూడ గౌడులే. వారు గౌడరారమరాధ్యశిష్యులు. కాని వారు శైవాభిమా నము గల స్మార్తులు. గుంటూరులోని బాబాజీలు వైష్ణవాభిమానము గల స్మార్తులు. ఈ గౌడశైవులకును గౌడవైష్ణవులకును ద్రావిడ కర్ణాటములందలి శైవవైష్ణవులతో నెట్టి పొత్తును లేదు!

ఈ బాబాజీమఠము ఎఱ్ఱచెరువుకు పశ్చిమమున అర్ధక్రోశము దూరమున గలదు, ఆ యడవిలోననే కొంతభాగమున చెట్లు నరకించి యక్కడ నా మఠము నిర్మించిరి. గౌడదేశీయులకు జగన్నాథ స్వామి ఇష్టదైవము. ఆ మఠ మక్కడ స్థాపించిన మొదటిబాబాజీ యగు శ్యామలదాసు, అందులో జగన్నాథస్వామికి చిన్నయాలయ మొకటి ప్రతిష్ఠించియుండెను. అట్లామఠముక్రిందికి ఆక్రమణ లోనికి వచ్చిన ప్రదేశము నాతడు గుంటూరుప్రభువులచే నగ్రహార ముగా పొందుటవలన, దానికి శ్యామలదాసుఅగ్రహారమని పేరు వచ్చెను. ఆ మఠమున కాని ఉత్తరమున నొక చిన్నచెరువు నాతడు త్రవ్వించెను. దానిలోనికి ఎఱ్ఱచెరువులోనికి పోవు కొండకాలువ నుండియే చిన్నతూము పెట్టి నీరు పెట్టుచుండిరి. ఆ యగ్రహార ప్రజల కది నీటివసతియై యుపయోగపడుచుండెను. ఆ చెరువుకు బాబాజీమఠముచెరు వను పేరు వెలసెను.

ఆ మఠమునకు తూర్పుద్వారమునొద్ద నొకటియు, పశ్చిమ ద్వారమునొద్ద నొకటియు ఆచ్ఛాదనము లేని హనుమద్విగ్రహములు ప్రతిష్ఠింపబడినవి. ఇవిగాక అక్కడ ననాదిగా జగన్నాథస్వామి యాలయమునకు పశ్చిమమున ఏబదివిండ్లదూరమున, ఆకాశమే యాచ్ఛాదనముగా గల యొక గణపతివిగ్రహము కలదు. ఆ విగ్రహముక్రింద పెద్ద నిక్షేపము లున్నవనికూడ నొక ప్రతీతి యుండెను.

ఆ మఠము స్థాపించిన శ్యామలదాసుబాబాజీకి అక్కడనుండి యా గణపతివిగ్రహమును మరియొకచోటికి మార్పింపజూచుచుండగా, నాతని కిష్టదైవ మగు జగన్నాథుడు స్వప్నములో కనబడి యాతని వలదని వారించెనట. నాడాదిగా దాని నెవ్వరును కదలింపగూడ దని యాతడు కట్టడిచేసెను.

ఐనను ఆయనతర్వాత మఠాధిపతి యైన బాబాజీకి ఆవిగ్రహము క్రింద నున్న నిధి తీయించ నిచ్ఛ కలిగినది. అతడును మంత్రతంత్ర దక్షుడు. ఆ పని కాతడు తలపెట్టి పెద్దతంతు చేయించి, యజ్ఞ

నొకరాత్రివేళ మహిషాదుల బలి యిప్పించెనట. ఆ పిమ్మట నా విగ్రహము పెకలింప నాతఁడాజ్ఞ యిచ్చెను.

ఆ విగ్రహము కదలింప భూమిపై మొదటి పలుగుదెబ్బ పడినది. ఆ పలుగు వేసిన పరిచారకుడు ఆపాదమస్తకము కంపించుచు పడిపోయెను. అచ్చటనే యున్న బాబాజీయును వెంటనే స్మృతి తప్పి పడిపోయెనట! ఆతనినోటివెంట కొంచెము రక్తముకూడ వచ్చెనట! ఆతడు జీవించెను. పరిచారకుడును బ్రదికెనుగాని వానికి పిచ్చియెత్తెను. ఆ పిచ్చివానిమాటలే యీ రహస్యము లోకములో పొక్కుటకు కారణము! ఆ పిమ్మట గణపతిని కదలించు ప్రయత్న మాగిపోయినది. బాబాజీ యక్కడ నిత్యపూజ చేయ నొక పూజారిని నియమించెను. తదాదిగా చుట్టుపట్టుల జనములకు ఆ గణపతిపై భక్తిగౌరవము లతిశయించెను. ఆ మహాలక్ష్మీగణపతికి పూజ లతిశయించెను.

ఈ బాబాజీలందరును గోసాయీలు. వారికి వివాహములు లేవు. కాని ద్రవిడసన్యాసులకును వీరికిని భేదములు కలవు. వీరు శిరస్సులు ముండనము చేయించుకొనరు. శిరోజములు దీర్ఘముగా పెరిగిపోయి జడలుకట్టియుండుటచే వీరు జడదారులు. వారి గడ్డములును మీసములును పొడుగుగా పెరిగియుండును. ఆ పరంపరలో తరుచుగా స్థాపకు డగు శ్యామలదాసునామము వచ్చుచుండెను. ఇప్పు డున్న బాబాజీనామమును శ్యామలదాసే. అతడు మిక్కిలి సత్త్వసంపన్నుడనియు మహత్త్వము కలవాడనియు ప్రతీతి కలదు.

ధనుర్మాసములో నా బాబాజీమఠమున జగన్నాథార్చనము మహావైభవముగా జరుగును. అది చిన్నపల్లెయే యైనను ఆ యుత్సవమునకు దగ్గరనున్న గొంటూరిపౌరులును, అవల నల్లచెరువు నానియున్న గ్రామప్రజలును, చుట్టుపట్టుల గ్రామముల జనములును విశేషముగా నక్కడ చేరుచుందురు.

ఈ నా డక్కడ వైకుంఠైకాదశీపర్వము మహోత్సవముగా జరుగుచున్నది.

గొంటూరునాగదేవుడు బాబాజీమఠములో నున్న మహాలక్ష్మీగణపతికి భక్తుడు. ఆతనికి జగన్నాథస్వామియందును శ్యామలదాసునందునుగూడ విశేషముగా భక్తిశ్రద్ధలు కలవు. ఆ బాబాజీ కతడు సర్వవిధముల సౌకర్యములు కలిగించుచు విరివిగా కానుకలర్పించుచుండెను.

గొంటూరునాగదేవుడు కొంతకాలమునుండి గణపతిదేవుల ధిక్కరించెను. అది యీ బాబాజీ పట్టించుకొనలేదు. కాని యిప్పు డాతడు దోపిడులు చేయించుచుండె ననియు తెలియవచ్చుచున్నది. అది తెలిసినప్పటినుండియు పూజ్యు డగు నా బాబాజీకి కష్టముగా తోచుచుండెను. కాని ఏమని చెప్పగలడు?

ఈ మఠములో పెద్ద యతిథిశాలలు కలవు. గోసాయీలు ఎవరు వచ్చినను వారికందులో భోజనాదిసర్వసౌకర్యములు నా మఠమువారు నియతముగా చేయుచుండిరి. ఆ యతిథిశాలలును మహాభవనములు. అవి గొంటూరివిభు లర్పించిన ధనముతోడనే పెక్కు కట్టబడినవి. ఒక్కొక్కసారి గొంటూరి నాగదేవునికి అతిథు లెక్కువయినచో నందులో కొందర నాతడు బాబాజీమఠములోని యతిథిభవనములలో నుంచుటయు కద్దు. ఆ భవనములును మఠమునకు ననుకపైపున పశ్చిమప్రచివర నున్నందున, అక్కడ రాజాతిథులుండి వారును వారి పరివారములును రాకపోకలు చేయుచున్నను, మఠములోని నిత్యకర్మకలాపముల కెట్టి యాటంకము నుండెడిది కాదు.

ఈ మధ్య గొంటూరు నాగదేవుని యతిథిశాల లన్నియు నాతని గౌరవాతిథులతో నిండిపోయినవి. నాగదేవుని మిత్రు లెందరో అక్కడికి వచ్చియుండిరి. ఎఱువమల్లి చోడుడు, కేశవదేవుడు, సోమిదేవుడు, అల్లుగంగు, మలికార్జునుడు, దామోదరుడు-మరియు నెందరో గొప్పపరివారములతో వచ్చియుండిరి. వారందరు మండలాధిపతులే; అందరును గణపతిదేవులను ధిక్కరించుచున్నవారే! గొంటూరుకు సమీపమునసుండు కోణిదెన మొదలగు ప్రదేశములకు పాలకులే యందరును!

వారి కందరకును జన్నిగసేనల కదలికలు తెలిసినవి. అంబదేవుని మహాసైన్యము వచ్చుచున్నట్లు బాగుగా తెలిసినట్లు తోచదు. అవల నెల్లూరుజటావర్మసుందరపాండ్యునియొద్దనుండి వారల కందరకు రాయబారములు వచ్చినవి. వా రిప్పు డేమి చేయుట?

వారిలో నొక్కొక్కరు ప్రత్యేకముగా అటు జటావర్మసుందరపాండ్యునిగాని, ఇటు కాకతీయమహాసేనలనుగాని, ప్రతిఘటింపలేరు. వారందరు ఏకముఖముగా నున్నను, ఆ పనులు సాధించలేరు. కాని వా రేకముఖముగా నున్న, నెవ్వరైనను వారితో జాగరూకులై సంచరింపవలసియుండును. వారొకరితో కలసిన రెండవవారికి జయము కష్టమగును.

అట్టివారు సామాన్యముగా తమకు దగ్గరవారితో కంటె దూరమువారితో కలియుట కిచ్చగింతురు. కాకతీయులతో గలసినచో వారికి చిన్నమండలేశ్వరపదవులే స్థిరము లగును. కాని దక్షిణాము నుండి దండెత్తివచ్చుచున్న పాండ్యకాడవులతో కలసి కాకతీయులను చీకాకొనరించిన వారికి లాభము. ఈ పాండ్యకాడవు లిందుల నెక్కువకాల ముండబోరు. వారితో కలసి జయించినచో అచిరకాలమున తమకు స్వతంత్ర మగు పెద్దమండలాధిపత్యములు ప్రాప్తించును. ఎవరిని తామిప్పుడు చేరవలె? ఎట్లుచేరవలె?

కాకతీయులతో వారి సంబంధము ఇప్పటికే శిథిలమించిపోయినది. కాని పాండ్యులను నమ్మదగునా? నమ్మకుండి చేయున దేమి? పాండ్యుడు వారలను తొందరపెట్టుచున్నాడు. వెంటనే నిశ్చయముచేయకున్నచో నాతని వాహిని ముందు తమ్మనే ముంచివేయవచ్చును. ఇటు కాకతీయులకు అటు పాండ్యకాడవులకు, కానివారగుదురు!

మొత్తముమీద వారు సుందరపాండ్యుని జేరుటకే నిశ్చయించిరి కాని యాతడు ఈమధ్య పంపుచున్న వార్తలు వారికి అలజడి కలిగించుచున్నవి. అవి మిత్రరాజులకు పంపుచున్నట్లుగా లేవు. చక్రవర్తి తన సామంతులకు పంపుచున్న యాజ్ఞలవలె కనబడుచున్నవి. ఈ పాండ్యుని దాసుల మగుటకేనా, మనము కాకతీయ చక్రవర్తులను ధిక్కరించినది?

అదికాక కాడవసేనలగురించియు, పాండ్యసేనలనుగూర్చియు అతిశయోక్తులతో కూడిన వార్తలు వచ్చుచుండెను. కాడవసేనలే పదునెనిమిదిలక్షలని వారు వినిరి. కొప్పెరుంజింగని సేనాచలనములను వారి వార్తాహరులు చూచియుండిరి. కొందరు ఒకటి రెండులక్షలకంటె పరివార ముండదని వారికి చెప్పిరి. వారు నమ్మదగినవారే కాని పలువురు వేగరులు పదునెనిమిది లక్షలే యనిరి. కొప్పెరుం

(33-వ పేజీ చూడుడు)

# ఇండో చైనా ఆటవికజాతి - మోయీలు

శ్రీ పి. బి. ఆచార్య

ఇండోచీనా మిట్టప్రదేశములలోని ఒక జాతివారు మోయ్‌లు. వారు పెక్కు తావులందు తరుచు చెదురుగా కనుపించుచుందురు. విశేషముగ వారు అరణ్యప్రదేశములందే నివసించుచుందురు. అరణ్యవాసులయినను వారి జీవితములు చాల ప్రశాంతముగనే గడచుచుండును.

మోయ్‌లు సుమారు ఐదుఅడుగుల ఎత్తు కలిగి ఉందురు. వారి ముక్కులును మూతులును వెడల్పుగ ఉండుట గమనింపదగిన విశేషము.

పెక్కు కుటుంబాలు చేరి సమిష్టిగా ఒక గుడిశెలో ఉండుట పరిపాటి. ఒక గ్రామములో నూరు కుటుంబముల మోయిజాతివారుండిన గుడిశెలు మాత్రము ఇరువది ఇరువదైదు మాత్రముండును. ఆ గుడిశెలు సాధారణముగ ఎత్తు ప్రదేశములందు వెదురుతో నిర్మితములై ఉంటాయి. గుడిశలలో లోభాగము పుర్రెలతో, ఎముకలతో, చర్మములతో అలంకరింపబడిఉంటుంది.

ఇండోచీనా, చెమ్మప్రదేశము అగుటచే వారు పరుండుటకు కొంచెము వెడల్పగు కొయ్యపలకలను ఉపయోగించుచుందురు. దోమలబారినుండి తప్పించుకొనుటకై సర్వదా వారి ఇండ్లలో పొగ రాజుచునేయుండును. తక్కిన ఆటవికులవలెనే మోయిజాతివారును తరుచు ఒక తావునుండి మరొకతావునకు తమ నివాసములను మార్చుచునేయుందురు. వ్యాధులకు, అగ్నిప్రమాదములకు భయపడియే వారట్లు చేయుచుందురు. పైరు పంటలు నీరు లేకపోవుటకూడ మోయ్‌లస్థల పరివర్తనమునకు ముఖ్యకారణము.

## ఆహారము, అలంకరణము

మోయ్‌లు బియ్యమునే ముఖ్య ఆహారముగ నుపయోగించుచుందురు. మాంసము, చేపలు, దుంపలు, పండ్లు కూడ ఆహారముగ నుపయోగించెదరు. మోయ్‌లు ఆహారవిషయమున నెంత శ్రద్ధ కలిగియుందురో దుస్తుల విషయమున నంత అశ్రద్ధ కలిగియుందురు. పైగ అరణ్యవాసులగు మోయ్‌లు తరుచు దిగంబరులుగనె ఉందురుకూడ. వారిని చూచిన హరిద్వారములో జరుగు కుంభమేళకు అరుదెంచు దిగంబరసాధుపుంగవులు వలె నుందురు. పురుషులు అంతే. స్త్రీలు అంతే. మనవంటివారిని చూచి కూడ వారు కించిత్తయిన కలవరపాటు నొందరు. వారి మానాన వారుంటారు. కాని అన్నిచోట్ల అందరు ఇట్లాగే ఉంటారనడానికి వీలు లేదు.

మోయ్‌జాతిస్త్రీలు అలంకరించుకొనడములో ఓ కొంత విశేషము ఉండి. వెదురు ముండ్లతో చెవులు కుట్టుకొని రాగిచుట్టలు తగిలించుకుంటారు. వివిధవర్ణశోభితములైన మణిహారములను ధరిస్తారు. ముఖానికి ఓవిధమయిన రంగు పాముకుంటారు. చేతివేళ్లకు కూడ తరుచు రంగు వ్రాస్తూనేఉంటారు. పంటి చిగుళ్లు చెడకుండ ఉంచేందుకని పండ్లకు కూడ తరుచు ఆకుల పసరు పట్టిస్తూ ఉంటారు.

## వ్యవసాయము

మోయ్‌జాతివారికి వ్యవసాయముమీద చాల శ్రద్ధ ఉంది. వారి వ్యవసాయము సమిష్టివ్యవసాయముగ ఉంటుంది. గ్రామస్థులందరు ఒకటిగా చేరి అడవులు కొట్టి పొలాలుగా చేసి వ్యవసాయము సాగిస్తారు. అరకకు దున్నలను కట్టారు. కోతలయినంతనే పంటను అందరు సమముగ పంచుకొంటారు.

ఇండోచీనా మిక్కిలి సారవంతమగు ప్రదేశము. అచ్చట సాధారణముగ ముక్కారులు పండగలవు. కాని మోయ్‌లు ఏడాదికి ఒకసారిమాత్రమే వ్యవసాయము చేస్తారు. కాబట్టే వారికి సంవత్సరమంతా చాలినంత ఆహారము ఉండదు. మరుసాలు పంట వచ్చేంతవరకు ఫలాలు, కందమూలాలు తిని జీవిస్తారు. కొన్ని సమయాల్లో పొగాకుకూడ పండించుతూఉంటారు. వారిలో స్త్రీలు పురుషులు కూడ పొగ త్రాగుతారు. పురుషులు పొగాకుచుట్టలను ఎండుఅరటిఆకులలో చుట్టి, స్త్రీలు రాగిబిలుములలో పెట్టుకుని పొగ పీలుస్తారు.

## గృహ పరిశ్రమలు

మోయ్‌లు జీవితావసరములగు వస్తువులన్నిటిని స్వయముగ వారే తయారుచేసుకొనుచుందురు. వేముతో బుట్టలు మొదలగు గృహోపకరణములను తయారుచేసికొందురు. మట్టికుండలను విస్తారముగ తయారుచేసికొని ఉపయోగించుకొందురు. మోయ్‌లు మట్టితో చేసిన కుండలను ఆములో పెట్టి కాల్చుటకు మారుగ ఎండలో ఎండించి ఉపయోగించుకొంటారు. పత్తి పండించి రాట్నములో నూలు తీసి ప్రాతపద్ధతులలో చిన్నచిన్న మగ్గములలో చిన్నచిన్న గుడ్డలను నేసికొనుచుందురు. నేసిన గుడ్డలకు రంగులనుకూడ వేసికొందురు. భూమిపై లభించిన రాగి, ఇనుము ఉపయోగించి ఈటెలు, కత్తులు మొదలగు ఆయుధములను, పొగ త్రాగటానికుపయోగించే బిలుములను, నాట్యసమయాల్లో ఉపయోగించే తాళములవంటి వాద్యవిశేషములను తయారుచేసుకుంటారు.

(40-వ పేజీ చూడుడు)

స్కెచ్ :

# ఆత్మహత్యాభియోగం

శ్రీ. కె. ఆర్. కృష్ణ

'ఎందుచేత?' అని శ్రీమతిగారు నిలదీసి అడిగితే చెప్పలేంకాని ఎందుకో హఠాత్తుగా మొత్తానికి మనకి జీవితంమీద విరక్తి కలిగిన మాట వాస్తవం. విరక్తి కలిగినమాత్రం చేసేదేముందీ? చావడం తప్ప. చావడం అంటే మాత్రం సామాన్యమైన పనిగనుకనా? వెనక ఎవరికైనా ఓ బిడ్డడు పుట్టాడూ అంటే ఎంతో సంతోషపడేవారు వాడితాలూకు బంధుమిత్రపరివారమంతాను. ఇప్పుడో? ఎవరైనా జారిపోయాడూ అంటే 'అహా! ఎంత అదృష్టవంతుండీ! సుఖంగా నిక్షేపంగా జీవితానికి మంగళం పాడేశాడు' అనివిసుపోయి, కనపడ్డవాడి కల్లా బొట్టూ కాటుకా పెట్టి, కవిత్వధోరణిలో మరీ చెప్పకపోతున్నారు. ఈ చావడం అనే కార్యం ఎంతకష్టసాధ్యమైనప్పటికీ, చావదలచుకున్నవాళ్లం గనుక చావక చేసేదేముంది?

మా ఆవిడతో 'ఏమేవ్' సుందూ! (మాఆవిడ అసలుపేరు స్వప్నసుందరి. అయితే అది స్వప్నంలోమాత్రమే సుందరిలా కనబడుతుంది గనుక 'సుందూ' అని పిలుస్తుంటాం) ఈ జీవితం అంటే రానురాను అసహ్యం వేస్తోంది. సాధ్యమైనంత త్వరలో జీవితానికో మంగళం పాడేయ దలచుకున్నాం' అనేసరికి వెంటనే మా ఆవిడ 'ఆయొయ్యో అలా అంటారేమిటండీ? మీరు లేకపోతే నాగతేం కావాలీ? అని మామీద పడి ముమ్మల్ని కావలించుకుని శోకాలాపనలతో ఏడ్వాలా (కనీసంనటనకైనాను)? అహ? అటువంటి పొరపాటేమీ చేయలేదు. పోగా 'మిమ్మల్ని చావొద్దని ఎవరు బ్రతిమాలారూ? వంటనే చచ్చి పొండి నిక్షేపంగాను. చస్తానని బెదిరిస్తారేమిటే, మహా బ్రతికి అందరినీ ఉద్ధరిస్తున్నట్టు?' అని అనేసింది ధపీల్మని నవ్వుతూ. నా మొహం అట్లపెనం మాదిరిగా నల్లబడడం చూచి 'కటినే హాస్యానికన్నానండీ, మీరు ఎల్లానూ చావరు; చావలేరు. ఒకవేళ చస్తే మాత్రం నే నూరుకుంటానా? వెంటనే సహగమనం చేసెయ్యనూ?' అంది సుందు. మాకు మాత్రం సుందు మాట్లాడినమాటల్లో ముందు భాగం నమ్మకంలో వెనకభాగం నమ్మకంలో ఇప్పటికీ తికమకగానే ఉంది.

మనకిమాత్రం చావాలనే పట్టుదల రోజురోజుకీ చిక్కనౌతోంది. ముఖ్యంగా మన చావునుగురించి మా సుందుకే నమ్మకం చాలనప్పుడూ, పైవాళ్ళ ఖర్మమేం కాలిందంట మనమాట నమ్మడానికి? మాసుందుకిమాత్రం మనలో ఎక్కడో చోట చావగల సామర్థ్యం నక్కి ఉందనే సంగతి తెలియజేయాలి. ఆత్మహత్యకి సులభమైన మార్గాలు లక్షోపలక్షలున్నాయి. నేపాళపుకాయల చిదగ్గొట్టి నూరుకుతాగామంటేసరి తక్షమని చచ్చి ఊరుకుంటాము. అయితే ఆ నేపాళపుకాయలతోపాటు మన తలకాయనికూడా జత చేసి రోట్లో మా సుందు వేస్తుందనే ధైర్యంకొద్దీ సదరు ప్రయత్నం ఉపసంహరించుకోవాల్సొచ్చింది.

విలువైన వాట్లల్లో అతివిలువైనదీ మహావిలువైనదీ అయిన ఉపాయం ఒకటి తట్టింది. సదరు ఉపాయానికనుగుణంగా ఒక తులం నల్లమందుపర్మిటుకోసం ఒక దరఖాస్తుని దానిని స్వహస్తాలతో వ్రాసి దానిని స్వయంగానే తహసీల్దారుగారికందజేశాము. ఆయన మనకేసీ మనదరఖాస్తుకేసీ ఎగాదిగా చూస్తోంటే మన గుండెదడదడలాడింది. 'మన ఆత్మహత్య తాలూకు భోగట్టా వీడికెలా తెలిసిందిరా బాబూ! కొంపదీసి అరెస్టు చేయించడుగదా!' అనిఅనుకుంటుండగనే ఆయన 'ఓహో యూ, జాంపండలాంటి కుర్రాడివి, నీకు నల్లమందు అలవాటేమిటోయ్' అని చెప్పి నవ్వుతూ నవ్వుతూ నాలుగుచివాట్లు వేసేసరికి మన ముహం కందగడ్డలా తయారైందని వేరే చెప్పనవసరం లేదనుకుంటాం. దరఖాస్తును తహసీల్దారుగారిదగ్గరనే విడిచిపెట్టి మెల్లగా బయటికి జారుకున్నామనుకోండి!

ఇంతకీ మనచావు విషయం పురుట్లోనే సంధికొట్టినట్టైంది. ఇంటికొచ్చేసరికి మా సుందునవ్వు మొహం చూసేసరికి నరికి పాతేయ బుద్ధయింది. మరి మన మొహం చూస్తే దానికెలా అనిపించిందో!, 'ఏమిటండీ? అస్తమానం అలా చిరచిరలాడతారూ?' అంది విసుగ్గాను. కాళ్లు కడుక్కోవడానికని పెరట్లోకి వెళ్లేసరికి నీళ్ళబావి మనతాలూకు కర్తవ్యాన్ని జ్ఞప్తికి తెచ్చింది. మరుక్షణంలో మన శరీరం నూతిలో కనబడింది. చచ్చిపోయాననుకునేరు. అంత అదృష్టం ఇంకా మనపాలిట ప్రత్యక్షం కాలేదు. మోచేతులూ, మోకాళ్లూ మాత్రం విరిగిపోయాయంతే. నూతిలోకి ఉరకబోయేముందు ఆ నూతిలో కనీసం రెండు బిందెల నీళ్ళయినా ఉన్నదీ లేనిదీ ఆలోచించైనా ఆపని చేయాల్సింది. ఆ బావితాలూకు నీళ్లు కనబడడం మానేసి చాలాకాలమైంది అనేసంగతికూడా మరిచిపోయాం ఆసమయానికి. ఇంతకిచావంటేఅంత ఆదుర్దాగా ఉంది మనకి. సుందు చరచరా నూతిగట్టుదగ్గరికి వచ్చి 'ఎవర్ని బడిపిస్తారు లెద్దురు! ఇంతకీ నీళ్లులేనిబావిలో పడితే చస్తారని ఎవరు చెప్పారంట మీతో?' అంది నవ్వులో వెక్కట్టుకుపోతూ. పిల్లికి చెలగాటం ఎలక్కి ప్రాణపోకడలా ఉంది మనపని. 'ఎవరైనా చూస్తే నవ్వగలరు. వెంటనే పెద్దనిచ్చెన నూతిలోకి దించనే, పైకి వచ్చేస్తానని' మనం, 'పైకి వచ్చిం తర్వాత ఓ కోయంబత్తూరుచీర కొనిస్తానని ఒట్టువేసేవరకూ నిచ్చెన దించేయ్యనని' సుందూ. ఇంకాసేపుంటే ఇరుగుపొరుగు ఇళ్ళవాళ్లంతా పోగైపోతార్రా నాయనా' అనుకుని కోయంబత్తూరుచీర కొనిస్తానని చెప్పి, బయటపడ్డాము.

చావడానికెలానూ సంసిద్ధులమైయున్నాము గనుక చచ్చేముందుకూడ సుందుకెక్కడలంచం పెట్టనూ? అంచేత ఆ చచ్చేదేదో వెంటనే చస్తే సుందుకి కోయంబత్తూరు చీర ఎగవేసెయ్యొచ్చనుకుని మరోమాంచి ఎత్తువేశాము కాలేజీ లేబొరేటరీమాష్టరు సుబ్బారావుగారి జేబులోకి ఓ అయిదు రూపాయలనోటు తోసేశామంటే సరి, మనకి

కావలసినంత సల్ఫ్యూరిక్ ఆసిడ్. మనకర్మకొద్దీ ఆవేళే ఆయన సెలవుపెట్టాలి? అక్కడ డిమాన్‌స్ట్రేటరెవరూ అచ్చట లేనిసమయం చూసి ఓ కాన్‌సెన్‌ట్రేటెడ్ నైట్రిక్ ఆసిడ్ బాటల్ ఒహటి జేబులోకి తోసేసి ఖంగారుగా బయటికి వస్తుంటే ప్రక్కజేబులో నున్న సీసా తలుపుకి తగిలి అది కాస్తా పగలడం, మనకాలంతా పంట్లాంతో సహా కాలడం ఒకేసారి జరిగాయి. యీ రభస చూసి ప్రక్కగదిలోనున్న డిమాన్‌స్ట్రేటర్లంతా ఓమేడేపెరేడ్‌లా వచ్చి, మనకాలు కాలినందుకు సానుభూతిచూపకపోగా నన్ను నానాచీవాట్లూ వేసి, వాళ్ళ లాబొరేటరీలో నున్న సోడియంహైడ్రాక్సైడంతా మన కాలుమీదనే ట్రీటుచేశారు.

కాలేజీకెమిస్ట్రీ లేబొరేటరీలో ఆపధంగా గ్రేడు తిని, కాలినకాలు మెక్కుసుకుంటూ వస్తూండగా వెనకనుండి కారుశబ్దం వినబడింది. మృత్యుదేవత ఈసారి మననుండి పారిపోలేదు అనుకుని రోడ్డుకు మధ్యగా నడుస్తున్నాం. మనమీదనుండి బస్సుపోతుందనే ధైర్యంకొద్దీ రోడ్డుకు మధ్యగా నడుస్తూపోతోంటే ఆ బస్సువాడు మనని తప్పించుకుని ఏప్రక్కనుండో పోతాడనే అనుమానం తగిలి వెంటనే రోడ్డుమీద జిగ్ జిగ్ పొజిషన్‌లో నడవడం ప్రారంభించాం. బస్ డ్రైవరు ఊరికే హార్న్ తెగవాయించిపారేస్తున్నాడు. ఆ హారన్ మనకెందుకు వినబడుతుంది! డ్రైవరు బస్‌ని ఆపుజేసి మహాఘనకార్యం చేసినవాడల్లే మనదగ్గరకొచ్చి మన జబ్బనుకుడేసి 'చవిటి వెధవలా హారన్ వినిపించుకోవేమ్? నువ్వు చస్తానని దిగులులేదు మాకు. నీతో బాటు మమ్మల్నీ చంపుతారు ఈపోలీసు వాళ్లు' అని ఈ దవడా ఆ దవడా అడపా తడపా వాయించి పంపేశాడు మన్ని. నడిరోడ్డుమీద ఒహబస్సుడ్రైవరు మనని అలా అవమానపరిచాడూ అంటే మాసుందు కెంత చిన్నతనంగా ఉంటుందీ! ఈసంగతి మా సుందు చెవిని పడిందీ అంటే ఆ డ్రైవరు గాడి పెళ్లాంబిడ్డలనుండి వాడి వంశవృక్షన్నంతనీ దుమ్మెత్తిపోస్తుందా? లేదా? ఈమాత్రమైనా ఆలోచించాడూ ఆ డ్రైవరు సన్నాసి? ఎందు కాలోచిస్తాడూ? వాడూ డ్రైవరువెధవ! వాడికి ముందు మాపే గాని వెనుక మాపెందు కుంటుంది!

ఇంటికి వచ్చీరావడంతోనే సుందు నా కాలినకాలునీ, రంగువేసుకున్న రెండు దవడల్నీ చూసి 'ఏమిటండీ ఇదంతా?' అంది. అడగ్గానే చెప్పేస్తే మన గొప్పతనమేముంది! అంచేత కాస్సేపు దానిచేత బతిమాలించుకుని, కాసిన్ని మంచినీళ్లు తెప్పించుకుని త్రాగి, తాపీగా జరిగిన వృత్తాంతాన్నంతనీ సవిస్తరంగా తెలియజేశాం. 'ఏమిటీ! ఒహ అనామకుడు, ఓహ బస్సుడ్రైవరువెధవ కొట్టాడా మిమ్మల్ని' అని అంటోంది సుందు. ఇహ వరసని ఆ డ్రైవరుగాడి కొంపంతా కూలిపోతుందిరా బాబూ అనుకొని చెవులు మూసుకోబోయే సమయంలో సుందు 'వట్టినే దవడమీద పట్టి ఊరుకున్నాడేమిటే, వెధవ! ఏ కాలో దమకొక్క విరగ్గొట్టెయ్యక, అప్పుడైనా శుభ్రంగా ఇంట్లో పడుందురు' అని వాణ్ణి తిట్టిపోస్తోంటే మనకి 'హంచిబాక్ ఆఫ్ నాటర్ డామ్' సినీమాలో చార్లెస్‌లాటన్‌ను కొట్టిన ముళ్ళకొరడాలు మెరుగనిపించాయి ఆ తిటకంటె.

ఇప్పటికి మనం చేసిన ప్రయత్నాలన్నీ విఫలం కావడం చూస్తే మన తాలూకు ఆత్మహత్యాప్రయత్నం విరమించుకోవాల్సి వస్తుందనే భయం కలక్కపోలేదు. రోజూ వార్తాపత్రికల్లో నలుగుర్నీ అయిదుగుర్నీ కమ్యూనిస్టుల్నీ పోలీసువాళ్లు కాలుస్తున్నారనే విషయాన్ని చదివాక కమ్యూనిస్టులతో సావాసం చేశాము, కాని మన నే పోలీసువాడూ కాల్చలేదు సరిగదా ఓలాటీపోటైనా రుచిచూపించలేదు. ఓరోజున విసుగెత్తి ఓపోలీసాడితో 'ఏవోయ్! నేను మంచి పేరున్న కమ్యూనిస్టుని. నన్నుమాత్రం కాల్చిచంపేరుసుమా!' అన్నాం. వాడు వెంటనే అదేంటి అబ్బాయిగారూ! నాతో పరాచకాలేంటి బాబయ్యా? మీరు కమ్యూనిస్టంటే ఏ చచ్చినాడు నమ్ముతాడు బాబయ్యా. వాళ్ళంతా అదోరకంమూక బాబయ్యా' అన్నాడు. చివరకి ఇరవైరూపాయల పోలీసువెధవకూడా మన మాటని నమ్మలేకపోయాడూ అంటే మన గొప్పతనం ఆలోచించుకోండి.

మన ఆత్మహత్యకుసంబంధించిన విషయం ఇంకా ప్రయత్నాల్లోనే ఉందన్నమాట. రాబర్టుబ్రూస్ అంతటివాడు 'ప్రయత్నించు, మళ్ళీ ప్రయత్నించు' అన్నాడు. మనంమాత్రం మన ప్రయత్నాలనుండి విరమించుకునే సూచన్లేమీ మనకే కనబడ్డంలా. సాధారణంగా మనుష్యులు ఆత్మహత్యచేసుకునే సాధనలన్నీ ఆచరణలో పెట్టాము, రివాల్వరు, రైలుక్రింద తలపెట్టడం తప్ప. రివాల్వరు సంపాదించడమంటే మాటలతో పనికాదు. నోరుచెడి ఎవరినైనా ఓసారి మీ రివాల్వరిస్తారా అని అడుగుతామనుకోండి వెంటనే వాడు గుక్క మలుపుకోకుండా అడిగే ఎదురుప్రశ్న ఏమిటీ? పిట్టపట్టేలా? నెత్రహారా ఆ? అని. ఆదెబ్బతో మన పళ్లు చల్లబడి ఊరుకుంటుంది. మనగోడు వాళ్ళకేం అర్థం అవుతుంది. అంచేత రివాల్వరు సంపాదనా ప్రయత్నం సమర్యాదగా విరమించుకుని వేరేప్రయత్నంచేయాల్సొచ్చినది.

సాయంత్రంవరకు సుందుతో సుఖంగా కాలం వెళ్ళబుచ్చి (ఆఖరుసారిగదా అనుకొని) తరువాత గ్రామపుపొలిమేరల్లోకి బయలుదేరాము. రైలుబద్దీలవారన ఓ అరగంటసేపు రైలు ఆగమనానికై నిరీక్షిస్తూ కూచున్నాం. సాయంత్రం అయిదున్నరకి రావాల్సినబండి మామూలు అరగంట లేటుతో కలుపుకొని ఆరు అరగంటల పదినిమిషాలకి ఫలానాస్టేషన్ వదలి ఈశాన్యదిక్కుగా మరో చూపుస్టేషనుకు పురోగమిస్తోంది. రైలుబండి కనుమేరలో ఉండగనే (ఆలస్యాదమృతం విషం అన్నారు కదండీ?) రెండుకమ్ములకీ మధ్యనున్న స్లీపర్లపై రైలు పయనిస్తున్న దిక్కుకే మనమూ పయనించసాగాం. రైలు ఊరికే కూసేస్తోంది. మన కెందుకు వినబడుతుంది ఆ కూత! మనంమాత్రం కళ్లు మూసుకుని ఊరికే నడిచేస్తున్నాం, ఏక్షణాని కాక్షణం మరుక్షణంలో రైలు మనమీదనుండి దొర్లిపోతున్నట్టు భావిస్తూ. రైలు ఒక్కసారి ఆగిపోవడం, దానితాలూకు డ్రైవరూ, గార్డూ ఇత్యాదిసమూహమంతా మనచుట్టూ పోగై నానాచీవాట్లూ వేయడం ఏకకాలమందు జరిగాయి. ఆరాత్రినుండే ప్రక్కఊరి పోలీసుస్టేషనులో మనకి బస ఏర్పాటు చేయబడింది. కోర్టువారు మనం ఫలానా సెంట్రల్ జైలులో ఓ సంవత్సరంపాటు బస చేయవలసినదిగా ఉత్తర్వు జారీచేశారు.

ప్రభుత్వంవారి ఇనుపకటకటాలలో విడిది అల్లుడిలాగా ఎనిమిదినెలలు గడిపాం. మరో నాలుగునెలల్లో మనం మన సుందూ తయారు. అయితే ఈ నాలుగునెలూ ఆ కటకటాలలో జీవించడం దుర్భరంగా తోచింది. మర్నాటి ఉదయం జైలుడాక్టరు వచ్చి 'ఏమండీ రావుగారూ! ఖులాసా? అని కుశలప్రశ్న వేశాడు. డాక్టరుని దగ్గరసారానిచ్చి సాగదీసి ఆయన తాలూకు దవడకు

మన తాలూకు చేతిలో గట్టిగా ముద్దుపెట్టించాం. ఆ మర్నాడుమాత్రం డాక్టరుగారు కొంచెం దూరనించే పలకరించాడు. డాక్టరు ఒహాడేమిటి! జైలరూ, పోలీసులూ మనని సమీపించినవాళ్లందరూ వారివారి భాగాలు పంచుకుపోయారు మూడురోజుల్లో. నాలుగోరోజున జైలులో మనకి స్థానం లేదన్నారు. ఇంటికి పోనివ్వ లేదు సుమండీ! జైల్లోని గాలిలేని గదులు మన ఆరోగ్యానికి భంగకరంగా ఉన్నట్టు జైలుఅధికార్లూ, జైలుడాక్టరూ భావించడంచేత మనని విశాఖపట్నం సముద్రపు గాలిని ఆస్వాదించమని కోరుతూ, విశాఖపట్నపు ల్యూనీటిక్ ఆసిలముకు బదిలీ చేశారు.

సెంట్రలుజైల్లో జీవితానికీ, ఇచ్చటి హాస్పిటలుజీవితానికీ గల వ్యత్యాస మేమిటంటే జైల్లో మనతోపాటు మన గదిలో ఎప్పుడూ ఇద్దరు ముగ్గురు భాగస్వాము లుండేవారు. ఇచ్చట మన గదిలో మనదే ఏకచ్ఛత్రాధిపత్యం. డాక్టరుతో చెప్పాము. 'మన కేమీ పిచ్చి లేదనీ, జైలునుండి విడిపించుకోడానికి వేసిన ఎత్తు అనీను' నా మాటలు పూర్తి కాకుండానే డాక్టరు 'నీవు మాట్లాడేదంతా పచ్చి అబద్ధం' అనేసరికి మన శరీరంనిండా తేళ్ళూ, జెర్రులూ పాకినట్టయింది. అంతలో ఊరుకున్నాడూ! 'అబ్బాయి! సాధారణంగా పిచ్చివాళ్ళంతా ఇలానే అంటుంటారు. వాళ్ళకేమీ పిచ్చి లేదని. ఆమాటకొస్తే పిచ్చిలేనివాడెవడూ ఈ ప్రపంచంలోనే లేడు. నీకు పిచ్చి లేదని నీవు అన్నావూ అంటే అదే రోగం. ఈ పిచ్చిఅనే పదార్థం ప్రతివ్యక్తిలోనూ కొద్దిగానో గొప్పగానో, వివిధరూపాల్లో తాండవిస్తుంటుంది. ఈ పదార్థం ఏవిధంగా, ఏ రూపంలో, ఏద్వారంగుండా, మెదడులో ఏభాగంలో ప్రవేశించి దాని స్థావరం ఏర్పరచుకున్నదీ, అది ఎక్కడెక్కడి సీలల్ని ఊడబెరికినదీ మేము దయాగ్నైజ్ చేసి వదులైన సీలల్ని వాటివాటి స్వస్థానాలలో అతిసైంటిఫిక్‌గానూ, టెక్నికల్‌గానూ అమర్చి మరీ నిన్ను బయటికి పంపిస్తాం' అని ఓ సుదీర్ఘమైన ఉపన్యాసం దంచిదంచి వదిలేసరికి, మన బుర్రలోని సీలలన్నీ నిజంగా లూజ్ అయినట్టు అయింది మనకి. వాడి ఉపన్యాస మేదో వాడిదే గాని అది మనకెంత వెగటుగా ఉందో

[illegible]

మల్లే ఉంది) చూసినట్టయితే వాడికి నుగ్రాహ్యమయ్యేది. ఈ హాస్పిటల్లోని సుగుణ మేమిటంటే ప్రతిరోజూ ఉదయమూ సాయంకాలమూ ఓ మేల్‌నర్సు వచ్చి నిమ్మపులుసుతో ఓ భ్రమంగలివాడు చేసేపని చేసిపోయేవాడు.

ఆస్పిటల్లో 15వనెల జరుగుతోంది. ఓరోజు ఉదయమే డాక్టరు వచ్చి చెప్పాడు. 'రావుగారూ! మీ మెదడు తాలూకు సీలలన్నీ వాటివాటి యథాస్థానాల్లో అతిశాస్త్రీయంగానూ, నవీన పద్ధతుల్లో దృఢంగా బిగించబడ్డవి. ఇప్పుడు మీ బుర్ర యాంత్రప్రపంచంలో ఏమూలనైనా ఘనంగా రాగస్తుంది. మీ రీహాస్పిటలునుండి వెళ్లిపోవచ్చు.' అన్నాడు.

ఇంటికి రావడంతోనే సుందుతో అన్నాము. 'ఏమేవ్, ఇంతకాలం నేను కనబట్లేదుకదా, నేను చనిపోయాననుకుని ఎందుకుసహగమనం చేయలేదు,' అని. వెంటనే అది తడుముకోకుండా 'నే నిదివరకే చెప్పలేదూ! మీరు చావరనీ, చావలేరనీను! మీరు నిజంగా ఆత్మహత్య చేసుకున్నప్పుడు నేనూ మీఅడుగుజాడల్లోనే నడుస్తానులెండి.' అంది నే నెలానూ చావలేననే ధీమాతో.

మళ్లీ మనకథ బయలుదేరినచోటుకే వచ్చింది. ఇంతా జరిగిన తర్వాత ఇప్పుడు ఆత్మహత్య చేసుకోవడమా?కి లేదా? మీరంతా కలిసి మన్ని చావమన సరే, మనమిప్పుడు వచ్చినా చావము. రాబర్టుక్లైవు కూడా మనకిమల్లేనే చావాలని ప్రయత్నించి విఫలుడై, ఓరోజున ఉన్నట్టుండి పెద్దవాడై పోయాడు. అంచేత మనం కనీసం రిపబ్లిక్ అధ్యక్షపదవినైనా స్వీకరించగలమనే ధీమా మన కుంది. అందుచేత మీ అందరికీ నే హెచ్చరించేదేమంటే మనం అధ్యక్షపదవి వెలిగించేప్పుడు, ఈకథ చదివిన ప్రేక్షకులందరికీ ఉద్యోగసంపాదనలో ప్రిఫరెన్సు ఇవ్వబడుతుంది గనుక ఈ Extra Qualication ని సంపాదించుకోమని మీ బంధుమిత్రులందరికే చెప్పుకోండి. మనతో అధ్యక్షపదవికిమాత్రంపోటీపడకండేం!

---




అష్టమ అఖిలభారత సోషలిస్టు మహాసభ పందిరి సింహద్వార దృశ్యం



ఖిలభారత సోషలిస్టుపార్టీ ప్రధాన
సెంట్రల్ స్టేషనులో దిగినప్పు
స్వాగత



అఖిలభారత సోషలిస్టు మహాసభ మొదటినాడు ఉదయం, అధ్యక్షుడు
కామ్రేడ్ అశోక్ మెహతాగారు జనతా జెండా మహోత్సవం జరిపిరి. జెండా
[illegible]



సోషలిస్టు మహాసభ సమావేశ అధ్యక్షు
అ శో క్ మె హ తా



ార్యదర్శి జయప్రకాశ నారాయణగా
ు పార్టీ అనుచరులు, తదితరులు
ఇచ్చారు.



సోషలిస్టుపార్టీ కార్యదర్శి కామ్రేడ్ జయప్రకాశ్ నారాయణ్ గారు, బర్మా సౌహార్ద ప్రతినిధులతో కలిసియున్న దృశ్యం.



# అఖిల భారత సోషలిస్టు పార్టీ అష్టమ వార్షిక సభ:





ఆహ్వాన సంఘాధ్యక్షురాలు శ్రీమతి కమలాదేవి చట్టోపాధ్యాయ గారు, శ్రీ అశోక్ మెహతా గారు, బర్మా సౌహార్ద ప్రతినిధులు.

# గాజుతలుపులు

ఏ. డి. ప్రసాదరావు

## మొదటి రంగం

రాజ్యం: ఏమండీ. వీట్లల్లోనైనా నాకొక సిల్కుచీరా, రవికా కేటాయిస్తారా, లేక యిల్లాగే ఈ మాసిన తొళతోళే తిరగమంటారా. ఆ శంకరంగారి వెంకమ్మ వాళ్లనీ చూస్తే ముచ్చటేస్తుంది. ఎప్పుడూ పట్టుపీతాంబరాలు తప్ప వేరేమీ కట్టరు కదా. మన మొహాలకు ఎంత వచ్చినా ఈ శని ఇల్లాగే పీడిస్తూంది. ఈ పేకేజీలోనైనా నాకు కొన్ని విడిగా యియ్యకపోతే నేను ఒప్పను.

చెంగ: ఆగవే. కొంపతీసి ఇవి మనింట్లో ఉన్నాయని ఎవళ్లతోనైనా అనేవు. ఈ పేకేజీమీద అధమం రెండువేలైనా మనకి లాభం రావాలి. విడివిడిగా మనం తీసుకొని పప్పుబెల్లాలులాగా వాడేస్తే ఎల్లా?

రాజ్యం: నా మొహంలాగుంది. అంగట్లో అన్నీ ఉన్నాయి అల్లుడి నోట్లో శని ఉందన్నట్టుగా ఉంది. ఇప్పటికి నలభై పాకేజీలు ఇల్లాంటివి మన చేతుల్లోనుంచి వెళ్లాయి. నా మొహానికి మాత్రం ఈ పాతకొంపా, ఈ చింకిపాతలూనూ. ఎవళ్లని చూసినా, మనలో పదోవంతు లేకపోయినా మనకు పదిరెట్లు కలకలలాడుతూ వుంటారు. ఈ దరిద్రం అంతా మన మొహాన్నే పొద్దుగూకినట్లుంది.

చెంగయ్య: అదుగో అదే వద్దంది. సంపాదనలేని జోగుల్లా మనమూ పోకుపోతే ఎల్లా? వీళ్లంతా రేపు పొద్దుటినించీ మన వాకిట్లో అడుక్కుతింటం నవు చూడు. అసలే నానా అగచాట్లు పడీ, ఆ చీకట్లో ఈ చీకట్లో ఈ నాలుగురాళ్లూ సంపాదిస్తూంటే, ఊరికే పదివేలకీ, ఇరవై వేలకీ మోతలు పెట్టావంటే మనపని కాస్తా అయిపూరుకుంటుంది. ఇప్పటికే మన మేదో చీకటి సంపాదనలను మొదలుపెట్టామని గుసగుసలు బయలుదేరాయి.

రాజ్యం: చాల్లెండి. ఏదో మీతో అన్నానని ఊరంతా యాగీ చేస్తున్నానంటారా? నేనన్నా యాగీ చేస్తే మీ స్నేహితుడు ఆ శంకరమే చెయ్యాలి. అయినా నాకెందుకు మీగు పదివేలు సంపాదించారో, లక్ష సంపాదించారో. నా కాపురంలో మాత్రం పెద్దమ్మోరు పీఠమేసుకొని కూర్చుంది.

చెంగయ్య: అది కాదే. నీకూ నగలూ చీరలూ కొనాలని నాకు మాత్రం లేదంటావా? నామటుకు నాకు చూడు. ఈపాత బట్టలు తప్ప మరేమైనా వేసుకొంటున్నానా? ఒక్క ఏడాది ఓపికపట్టు. ఈ బేరాలు కాస్తా చల్లబడి, అల్లరి అయే అవకాశం తగ్గిపోయాక మనమూ రాజా రాణీలాగా ఇంద్రభోగం అనుభవించవచ్చు.

రాజ: ఏళ్లై ఏళ్లొచ్చాక చదువుకోక మన్నుకొట్టుకోనా అని అన్నీ ఉడిగాక ఎప్పుడో అనుభవిస్తాము. ఎందుకులెండి. అసలు ఏమీ అక్కర్లేదు. అయినా మన మొహాలకేమీ ఉండదు. నిన్న మొన్న వచ్చాడు ఆ నారాయణరావుగారు ఊళ్లోకి. వాళ్ళ ఆవిడని, కూతుర్ని చూస్తే, వాళ్ళ నగలూ, వాళ్ళ చీరలూ కళ్లు మిరిమిట్లుగొలుపుతాయి. అయినా అనుభవించే యోగ్యత ఉండొద్దూ.

చెం: వాళ్ళ మొహాలు వాళ్ళకు నగలేం ఉన్నాయి. ఏదో మెడలో కాస్త చింతాకరతి బంగారం మెడచుట్టూ తిప్పాడు. ఏదో పట్టణం ఫాషన్లవి. చాకబారు చీర్లే ఇస్త్రీ చేసి మొహాలకు పౌడర్లు తగిలించి, పైకిపటారం తప్ప వాళ్ళదగ్గిర మాత్రం ఏముంది. అయినా ఆ వేషాలన్నీ నీలాంటి సంసారులకు తగుతాయటే.

రా: ఔనౌను. మూసివాయనం ముత్తైదులాగా ఇల్లాగే ఉంటే నయం. అయినా మీకు స్వయంగా తెలియాలి గాని ఎంతకని చెప్పుకొని ఏడ్చి చేయించుకొంటాం. పైకి పొక్కే మాట గయ్యాళుల మనిపించుకొనేందుకే కదా. అయినా మీమాట విచిత్రం తప్పు, మీ స్నేహితుడు శంకరం మీతో పాటు బ్లాకులో సంపాదిస్తున్నవాడు కాదూ. [illegible] పెట్టుకొని తిరుగుతూంటే అంతా ఏమైనా అంటున్నారా?

చెం: అనటంలే. అదే నేను వాడికి కన్నో సార్లు చెప్పాను. ఈసంపాదన ఉన్న వాళ్లు కొన్నాళ్లు కాస్త తమాయించరా లేకపోతే, యిద్దరం బైట పడిపోతాం అని. వాడితోటి ఏదో సెత్తిమీదికి వచ్చేటట్లుంది.

రాజ: అయినా మీకు ఆయన తోటెందుకు. లాభంలో పంపకం ఇచ్చుకోటం ఎందుకూ. మీరే చేసుకోరాదూ అన్నీనీ. లేరా, కప్పకు ఎలుకసాయంలాగా వీడిమూలాన మీరు బైట పడిపోవాల్సి వస్తుంది.

చెం: అదే చూస్తున్నా. వాడికి పెద్దవాళ్లల్లో పలుకుబడి ఎక్కువుంది. ఇదిగో రెండు మూడు లైసెన్సులు కూడా సిమెంటుకు, వాట్లకీ తెప్పించుకొన్నాక నెమ్మదిగా వదుల్చుకొంటాను. తొందరపడితే ఎల్లాగా. అన్నట్లు పోయి శంకరాన్ని కలుసుకోవాలి. కాఫీ అయిందా.

రాజ: కాఫీలోకి ఈ పూట దాటితే పంచదార లేదు. అటుకమూలబస్తాలోది కొద్దిగా తియ్యమంటారా!

చెం: హుష్‌హుష్. అది విప్పకు. నారాయణగారింట్లో కూతురు పెళ్లి వస్తోంది. ఆయన బ్లాకుమార్కెటు పనికిరావంటూ నీతినియమాలంటూ, లెక్చర్లిస్తూ, ప్రజలను కూడగట్టుకు రావాలని చూస్తున్నారు. రేపు పెళ్లికి ఆయన ఈబురదలో దిగకుండా ఎల్లా ఉంటాడో చూస్తాను.

రా: ఆమాత్రం లెక్చర్లు మీరుమాత్రం ఇయ్యరాదూ.

చెం: ఇయ్యకుండా ఊరుకున్నానా, మనమంతా కలిసి బ్లాక్ మార్కెటు అణిచెయ్యాలండీ అని నేనూ శంకరం కలిసి సంఘం పెట్టి ఆయన్ను ప్రెసిడెంటు చేశాం. కాస్త ఈ రుచి చూపించకుంటే కుక్కల్లే మన వెంట తిరగాల్సినవాడే.

రాజ: సరి ఆయనేదో పెద్ద నిఖార్సు మనిషి అని అనరూ. అయినా మందులూ అణి బ్లాక్ [illegible]

చెం: ఆ. ఏడిశాడు. తెలివితేటలు లెక్కడివి. అయినా వైద్యమే తప్ప మందులసావు లేదు.

రాజ: సరేలెండి. మీరు మరీ సత్యకాలపు మనుషులూ, మందులసావు ఉండా లేమిటి? ఆ లెఖ్ఖను మీకు బట్టలు కొట్టు ఉండా?

చెం: నిజమేనేవ్, బాగా చెప్పావ్.

రాజ: అసలు నాకు వాళ్ళ వరస చూస్తేనే ఒళ్ళు మండుకొస్తుంది లెద్దురూ. ఏమిటో ఓ సాంప్రదాయపు పద్ధతి చట్టుబండలూ ఏమీ లేదు. తల్లికీ కూతురుకూ ఎంత గర్వమంటారు. నంగనాచులలాగే, నోట్లో వన్న ముద్ద కరగనట్టు మాట్లాడతారు. మేమంతా పట్టి ఎద్దు మొద్దుస్వరూపాల మన్నట్లు తెలివితేటలు ఒలకబోస్తారు. నా దగ్గిర కాదివి అన్నీ, మొన్న ఆ అమ్మాయి ముగాన్నే నాలుగూ అనేశాను. ఈజాకెట్లు ఈచీరలు, ఈ వేషా లేమిటమ్మాయి, అంతగా ఉంటే నాలుగు కట్టకాసుల పేర్లో, కంటెలో చేయించుకోరాదా, ఏమీ లేందే ఏమిటే మిడిసిపాటని, ఆ. శుభ్రంగా అనేశా.

చెం: అదేమిటే, మొహంముందరే ఎందుకన్నావ్?

రా: ఊరుకుంటురూ, లేకపోతే ఎద్దులాగుంది ఇంతవరకూ పెళ్ళీ లేదు పెటాకులూ లేదు. తాను ఆడవాళ్ళందరకు స్కూలు పెడుతుందట, మాపిల్లల్నందర్ని పంపటమే కాకుండా మేమూ వచ్చి చదువుకో వచ్చునట. గడ్డుపచ్చి పిల్లను ఎక్కిరించిందని - అదీ కాకుండా సిగ్గూ ఎగ్గూ ఏమీ లేకుండా మొగాళ్ళతో పడి తిరుగుతూంటటం.

చెం: సరేలే కాఫీ అయితే ముందు తీసుకురా.

(బయటనుంచి చెంగయ్యా అనే కేక.)

రాజ: అడుగో మిత్రరత్నం, కాఫీవేళకు సరిగ్గా తయారయ్యాడు.

చెం: హుష్. ఉండు లోపలికి పో. ఇప్పుడు తేవద్దు, వాడ్ని పంపించాక తాగుతాను. (రాజమ్మ లోపలికి వెళ్తుంది.)

రావోయ్ శంకరం లోపలికి రా.

శంకరం: (ప్రవేశించి) అబ్బ హుష్, అప్పుడే ఎండ మండిపోతూందిం, ఎన్ని తిరుగుళ్ళు తిరిగితే ఒక్కొక్క పని గాను. చెంగయ్యా, మళ్లీ కోటలో పాగావేశావ్. ఆ రెండు పర్మిట్లూకూడా తెచ్చాను.

చెం: [సంతోషంతో] అసాధ్యుడవురా, శంకరం నువ్వు. ఎల్లా తెచ్చావ్ ఏమిటే కథ.

శంక: ఏ ప్రయాస లేకుండానే రావలసిందిరా. ఈ రాఘవయ్య అని కొత్తఆఫీసరు వచ్చాడు వచ్చాడు చూశావ్. వాడు మహా ఒళ్లు కొల్చుకొంటున్నాడులే. వీడు నెలరోజులబట్టీ మన అచోకీలన్నీ తీస్తూ వెంటబడుతున్నాడు. మనవాళ్లు పైన ఉన్నారు కాబట్టి సరిపోయింది—అయినా వీడి కింకా మన తడాఖా తెలిసి రావడం లేదులే.

చెం: శంకరయ్యా నీ కుంగర వాడెంతిరా? అసలు లంచాలు పుచ్చుకొంటున్నాడని అక్కడి మనవాళ్లకు రెండు పిటీషనులు బనాయించకపోయావ్.

శంక: ఊరుకున్నానటోయ్, గట్టిగా పంపించా. గరపలీథిలో మన సావుకార్లంతా కూడా పిటిషన్లమీద సంతకం చేశారు. లేకపోతే మహా నీల్గాలకు పోతున్నాడులే. మొన్న మిల్లు నరసయ్యమీద కేసు పెట్టించి శిక్ష వేయించాడు. నరసయ్యకూడా మనకు వత్తాసు అయ్యాడు.

చెంగ: మరింకా వాడి దిలాసా ఏమిటంటావ్.

శంక: ఏముంది. ఆ కొత్తడాక్టరు నారాయణ లేడూ. ఆయనకు ఇంతనంటే అభిమానం. ఆయనకూతురూ ఇతనూ కాలేజీలో చదువుకున్నారుట.

చెం: [నవ్వుతూ] అంతేనా. ఇంకా —ఏమన్నా జంట శాస్త్రాలుకూడా చదువుకున్నారా?

శంక: [నవ్వుతూ] అవి మనం వేరే చెప్పాలి! ఇదిగో త్వరలోనే ఇద్దరికీ పెళ్లంట కూడా చేసి, చేతులు కడుక్కొంటాడు.



ఏలూరులో వ్యవసాయ శాఖామంత్రి ఏ. బి. శెట్టిగారు వనమహోత్సవ ప్రారంభ సూచకంగా కొబ్బరమొక్కను నాటుట. జిల్లా కలెక్టరు జనాబ్ షేక్ అహమ్మద్, డి. వై. ఎస్. పి. మురుగేశన్ గార్లు కూడా చిత్రంలో ఉన్నారు.

చెం : అయితే నారాయణరావు రాఘవయ్యకు చేసే ఉపకారం ఏముంది?

శంక : నారాయణరావు నిజాయితీ మనిషని, ఉచితవైద్యం చేసి, బీదలను పోషించటానికి గాంధీగారి మతం పుచ్చుకున్నాడనీ, ఆ స్థిపాస్తులు ఏమీ మిగల్చుకోకుండా నిరాడంబరంగా బ్రతుకుతాడనీ, ఎల్లాగో వాళ్ళందరిలో ప్రచారం చేయించుకొన్నాడులే. అందుకని ఆయినమాటంటే అక్కడపై ఉద్యోగస్తులలో కొందరికి విలువ ఎక్కువట.

చెం : ఈ కొంగజపాలన్నీ నాదగ్గిర కాదులేవోయ్. ఎందుకూ మొన్న ఏదో నెల రోజులు జబ్బుచేసిందని మా ఆవిడకు మందిప్పించాను. మన మంగలి వీరయ్య మందిస్తే రెండు రోజుల్లో కుదిరేది. డబుల్ టైఫాయిడ్ అని నాబొందనీ చెప్పి, నెలా పదిహేను రోజులు రోగం పెంచి ఇంజక్షన్లు - పొడు అంటూ రెండు చేతులూ సూదిపోట్లతో నింపి చంపాడు. అన్నీ అయ్యాక మందుల డబ్బైనా ధర్మసంస్థకు చందాగా ఇప్పించండి అని అడిగాడు సిగ్గులేక. పైగా వుచితవైద్యం అని పేరూ. ఆ చేదుమందులన్నీ మింగలేక హోరుమని ఏడ్చింది మా ఆవిడ.

శంక : అదంతా, ఒక తంతు లేవోయ్. ఉన్నవాళ్ళు ఏదో తోచినంత ఇచ్చుకోవాలిట. అది బీదలకు వైద్యదానం చేస్తాడట. మధ్య తను మింగేందుకు. పైగా నటనకోసం పెళ్ళాం బిడ్డల ఒంటిని నగలు కూడా ఏమీ లేకుండా తిప్పుతాడు.

చెం : అవన్నీ వేషాలు లేవోయ్. బీదల వైద్యం పేరిట ఎంత దాచెయ్యకుండా ఉన్నాడంటావ్. అదీ గాకుండా గ్లూకోజ్ డబ్బాలు అవీ తప్పకుండా బ్లాక్ చేస్తున్నాడనే నా నమ్మకం.

శంకరం : చేస్తూనే ఉంటాడు. మొన్న మా యింట్లోకి కావాల్సి మన దగ్గిర డబ్బాలు తియ్యటం ఎందుకని 'మా ఆవిడకి జబ్బుగా ఉంది గ్లూకోజ్ ఎక్కడా దొరకటం లేదండీ, కొద్దిగా ఇప్పించండి అని అడిగాను. తనే ఒక చిన్న పొట్లం గట్టి ఇచ్చి, రోగులకోసం కొద్దిగా ఉంచాను. జబ్బు ఎక్కువగా వుంటే జాగ్రత్తగా వాడండి అంటూ గ్లూకోజ్ ఇచ్చాడు. బ్లాక్ చెయ్యనివాడికి గ్లూకోజ్ చిటికెడు మాత్రల ఎల్లా దొరుకుతుందంటా. ఆ తర్వాతే మందుల రామయ్యచేత గ్లూకోజ్ కావలిస్తే ఎక్కువ రేటుకు దొరుకుతుందని రామయ్య పేరుతో తెప్పించాను. సరుకు ఎక్కడుందో అప్పచెప్పకపోతే పోలీసులకు పట్టిస్తాను అని బెదరించాడట. ఉపకారానికి పోతే ఆయనగారు చేసే ఉద్దరింపు ఇది.

చెం : అబ్బాయి, నీ కెందుకు ఈ డాక్టరు గ్లూకోజ్ బ్లాక్ మార్కెటు చేస్తున్నాడని రాఘవయ్యకు పిటీషను పెట్టి *True* కాపీ కలెక్టరుకు పంపిద్దాం. కావలిస్తే రెండు డబ్బాలు మనవే అక్కడికి చేర్చు.

శంక : తొందరపడకూడదు. ఆగు. పిటీషను పెట్టానులే. ఆ రాఘవయ్యను ఈ నాన్నా కూడా కలిపాను. మన వ్యాపారం కూడా సమితి వేళకొంత సాగించి ప్రెసిడెంటుగా ఆయన ఎకౌంటులోనే వ్రాస్తున్నాను.

చెం : అదేం లాభం. మన మీదికి కూడా రాదూ.

శంకరం : నీకేం భయంలేదు ఊరుకో. ఇదిగో ఈ పర్మిట్లకు వెయ్యి ఖర్చుపెట్టాను.

చెం : ఇప్పటికి అయిదువందలూ తీసుకో. పని ముగిసిచుకోగానే తక్కినవిస్తా.

శంకరం : ఇప్పుడే చూద్దూ. చెంగయ్యా నేను అవతలవాళ్ళ కిచ్చేయాలి. ఇదంతా పైకి చెప్పుకోనేది కాదాయెను. తీరా ముగిశాక అటూ ఇటూ అయినా కన్నంలో దొంగకు తేలుకుట్టినట్లు నోరు మూసికోని కూర్చోవలసిందే తప్ప...?

చెం : అంత నమ్మలేవుటోయ్. సరే ఇవిగో తీసుకో. లెఖపెట్టక్కర్లేదులే.

శంక : అబ్బే అందుకు కాదోయ్ పొరపాటున ఏమన్నా తక్కువ ఇచ్చావేమో అని. నీ సొమ్ము నా కెందుకు.

(బైట కేక చెంగయ్యగారూ)

శంక : (ఆదుర్దాగా) ఏవరూ రాఘవయ్యలాగున్నాడే. ఏం పనికట్టలేదుకదా. ఆ పర్మిట్లు పెట్టెలో పెట్టెయ్. పెట్టెలో వద్దు జేబులో పెట్టు. లేకపోతే నేను డబ్బుదాస్తున్నట్లు రొండిని పెట్టి—

(చెంగయ్యగారూ, చెంగయ్యగారూ)

చెం : ఒసేవ్ రాజ్యం. ఎవరో పిలుస్తున్నారు చూసిరా.

రాజ్యం : (విసుగ్గుంటూ) సరేలెండి బాగుంది. (బైటికి వెళ్ళి అక్కడే అడుగుతూన్నట్లు) ఎవరండీ. ఎవరికోసమని).

రా : చెంగయ్యగారు ఉన్నారమ్మా - నేను రాఘవయ్య నని చెప్పండి?...

శం : (కంగారుగా) అదేమిటి పుస్తకం మీద బ్లాకుమార్కెటు కాతా అని వ్రాశావేమిటయ్యా తెలివి తక్కువట్టే ఉంది. ఆ డ్రాయర్లో దాచెయ్యి. లేకపోతే ఇలా తే. పంచలో దిగిస్తా.

చెం : శంకరం నాకేం తోచటం లేదు. వీ డెందుకు వచ్చాడో.

శంకరం : హుష్ కంగారు పడక లోపలికి రానీయ్. శాంతంగా ఏవో కబుర్లు మాట్లాడుతూన్నట్లు కూర్చో.

రాజ్యం : (లోపలికి వచ్చి) నారెవరో రాఘవయ్యగారట. వీధిలో నుల్చొన్నారు.

చెం : ఇంట్లో లేరని చెప్పలేకపోయావ్.

రాజ్యం : చెప్పమంటే అల్లాగే చెప్తాను. కాని శంకరంగార్ని కూడా పిలవంటి అన్నాడు.

రాఘ : [లోపలికి వస్తూ] నమస్కారమండీ చెంగయ్యగారూ. ఇదుగో శంకరంగారూ ఇక్కడే ఉన్నారే. నమస్కారమండి.

చెం : నమస్కారమండి. కూర్చోండి.

శంకరయ్య : నమస్కారం. మీరు బైట నిల్చోటం ఎందుకండి. పరాసరి లోపలికి రావచ్చుకదా. మీకు మా యిళ్ళల్లో అభ్యంతరా లేమి ఉంటాయి. ఏదో వేళకాని వేళ దోవ తప్పి ఇల్లా వచ్చారు.

రాఘ : అబ్బే. ఏమీ లేదండి. మీలాంటి పెద్దల సహాయం కొంత కావలసి వచ్చాను. నాకు ఈ ఊళ్ళో ఈ ఉద్యోగం ఇచ్చారా. నాకా అనుభవం లేదు. చస్తున్నా ఎటుకదిలినా ఊరందరికి శత్రుత్వం అవటం తప్ప మరేమీ కనబడటం లేదు. మీలాంటి పెద్దల అండఉండి కాస్త నిలదొక్కుకో గలనని ఆశపడు తున్నాను.

శంక : అయ్యయ్యో, అంత మాటా, మీలాంటి ఉత్సాహమున్న యువక ఉద్యోగులు ఈ ఊరు వచ్చారు కనుక బ్రతుకుతున్నాము. కాపీంచి, లేకపోతే ఈ ఊళ్ళో ఉన్న అవినీతికి లంచగొండితనానికి మేమంతా మలమలా నల్లుల్లాగా మాడిపోతున్నాం, కదాండి, ఈ ఉద్యోగంలో మీకు వచ్చే పుణ్యం మమ్మల్ని తరతరాల తరింపచేయదుటండీ.

(38-వ పేజీ చూడుడు)

## బాలానందం

# భూగర్భంలో రైళ్ళు

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

**"ఆం**గ్లదేశంలో భూగర్భంలో రైళ్ళు నడుస్తాయిటగదా! వాటిని గుఱించి చెప్పు" అన్నాడు నరేంద్రుడు. మేరీ అత్తయ్య 'సరే' నన్నది. ఆమె ఇంగ్లాండు వెళ్లి వచ్చింది చెప్పసాగింది. అందఱు స్థిమితంగా కూర్చున్నారు.

"ఆంగ్ల దేశంలో లండనునగరం చాలపెద్దది." అని కథ ప్రారంభించింది మేరి. "అయితే అది మద్రాసుకంటే చాలపెద్దదా?" అని ప్రశ్నించాడు నరేంద్రుడు. అడుగులోనే హంసపాదు. "చాలపెద్దది మద్రాసు బొంబాయి, కలకత్తానగరాలను మూటిని ఏకంచేస్తే ఏర్పడే పెద్ద పట్టణంకూడా లండనునగరంలో సగం వైశాల్యం కలిగియుండదు. మద్రాసులో ప్రజలు ఒకపేటనుండి యింకోపేటకు ప్రయాణం చేయాలంటే సామాన్యంగా ట్రామ్ బండ్లపై పోతారు. అక్కడక్కడ ఎలక్ట్రిక్ రైళ్లు ఉన్నాయి. అట్లాగే లండనులోకూడా ఎన్నో ట్రాములు ఇతరాలు ఉన్నాయి. అక్కడ ఎలక్ట్రిక్ రైళ్లున్నాయి. కాని అవి మన మద్రాసులోలాంటివి కావు. అవి భూగర్భంలో నడుస్తాయి. అసంఖ్యాకములైన దుకాణాలతోను, ఆఫీసులు ఇండ్లు, ఇతరభవనాలతో క్రిక్కిరిసిన లండనువీధులలో భూమియుపరిభాగంపై రైళ్లు నడవటానికి తావు లేదు. అందువలననే వాటిని భూగర్భంలో నడిపిస్తున్నారు." అని కథ సాగించింది మేరిఅత్త.

"అయితే భూగర్భంలో ఉన్న రైళ్లను ఎక్కేది యెట్లా? స్టేషన్లు కూడా భూమిలోనే యుంటాయా? లేక పయిననా?" అని ప్రశ్నించాడు ప్రతాపు.

"చాలాస్టేషన్లు భూమిపైనే ఉంటవి. అవి మనదేశంలో స్టేషన్లులాగే ఉంటాయి. ప్రయాణీకులు టికెట్టు తీసుకోగానే ఒక గుండ్రనిగదిలోకి చేరాలి. దానికి కిటికీ లుండవు. లోపల విద్యుద్దీపా లుంటవి. గది నిండిన తరువాత ఒకఅధికారి తలుపులు మూస్తాడు. ఒక నిలువైన లోతుసొరంగంగుండా అది ఆగుతూ, ఆగుతూ లోనికి పోతుంది. అక్కడ ఒక అధికారి తలుపు తీస్తాడు. ప్రయాణీకులు విద్యుద్దీపాలతో ధగధగా మెరిసే బాటమీద 'ప్లాటుఫారం' చేరుకుంటారు.

అంతలోనే రైలు ఒకమహాగాఢాంధకారాన్ని చీల్చుకొని గుహాలో నుంచి వెలువడే సింహంలాగా ప్లాటుఫారంముందుకు వచ్చి నిలుస్తుంది. రైలు ఆగీ ఆగకుండానే, దిగవలసిన ప్రయాణీకులు వెంటనే దిగిపోతారు. వారందఱు దిగిపోయిన మరుసెకండులోనే ఎక్కవలసిన వారు ఎక్కుతారు. రైలు ఒక్క నిముషంకంటె ఎక్కువసేపు ఆగదు. తిరిగి ఒక మహాగాఢాంధకారపు సొరంగంలోకి రైలు పోతుంది.

రైళ్లలో చీకటిగా ఉంటుందనా మీయనుమానం. పూర్ణిమచంద్రికలకంటె కాంతియైన విద్యుద్దీపాలుంటాయి. రైలు ఆచీకటిసొరంగంగుండా పోతుంటే భూగోళాన్ని బ్రద్దలుచేస్తున్నంత పెద్దధ్వని కలుగుతుంది."

సుహాసినికి యిక్కడొక ధర్మసందేహం "అత్త! రైళ్లు ఎంతో లోతుగ భూగర్భంలో నడుస్తున్నాయి కదా! అక్కడ చాల ఉడికిపోదూ? పాడువాసన గొట్టదూ?" అని ప్రశ్నించింది.

"ఏమాత్రం కాదు. అక్కడ ఎంతో హాయిగ, శీతలంగా ఉంటుంది. ఎప్పుడు నిర్మలవాయువులు వీస్తుంటాయి. మనం నిజంగా సముద్రతీరాన ఉన్నామా అనిపిస్తుంది. పెద్దపెద్ద యంత్రాలద్వారా నిర్మలమైన వాయువులు భూగర్భంలో వీచునట్లు చేస్తారు.

కొన్నిచోట్ల భూగర్భంలోకి పోవటానికి "యస్కలేటర్లు" అనే కదలికగల మెట్లు ఉంటుంది. దానిమీదికి మనం చేరగానే అది క్రమంగ లోపలికి పోతుంది. అట్లాగా భూగర్భం నుండి పైకి యస్కలేటర్లుంటాయి. ఒకటి క్రిందికి, ఒకటి పైకి పోతు

బాలానందం సీరియల్:




మూలం: ట్రెజర్ ఐలండు
రచన: ఆర్. యల్. స్టివెన్సన్

6

అనుకరణ:
"నళినీమోహన్"

దీపం వెలిగించారు. ఆ వెలుతురులో దొంగలు ఆరుగురే ఉన్నట్లు కనిపెట్టేను. వాళ్లల్లో ఒకడు తలకు కట్టుతో మూలుగుతూ పడుక్కున్నాడు. అయితే మావాళ్లు ఏమయినట్లూ?

సిల్వర్ - తాపీగా నాకు ఎదురుగా కూర్చుండి, పైప్ ముట్టించి, సంభాషణ ప్రారంభించేడు. ఆ గొంతులో బుజ్జగింపే కాని, కోపం ఏమాత్రం లేదు.

"మీ వాళ్లికి నీమీద బాగా కోపంవచ్చింది. నీ ఊసే ఎత్తడం లేదు. ఇంక నువ్వు మాతో ఉండవలసినవాడివే"

దానినిబట్టి డాక్టరూ, ఇతరులూ బ్రతికిఉన్నట్లె గ్రహించాను. కొంత శాంతి కలిగింది. ఎవ్వరికీ చెప్పకుండా, సాయంచేసేవాళ్లుకూడా లేనిదశలో నేను పారిపోయాను. నా తెలివితక్కువతనంవల్ల మా వాళ్లంతా చచ్చిపోయేరేమో నని బాధపడుతూన్న నా మనస్సు శాంతించింది.

"ఇక్కడ నుంచి ఎందుకు వెళ్లిపోయారూ?" అని అడిగేను.

"పొద్దుట లేచి చూచేసరికి మా ఓడ ఏమయిందో ఐపులేకుండా పోయింది. ఆతర్వాత డాక్టరు మావద్దకు రాయబారం పంపేడు. ఇద్దరం మాట్లాడుకున్నాం. వాళ్లు నలుగురం ఉన్నా మన్నాడు. వాళ్ళని వెళ్లిపోనిస్తే ఇల్లూ, సామగ్రీ, వదిలిపెడతానన్నాడు. ఒప్పుకొన్నాం. వాళ్లెక్కడికి వెళ్లేరో మరి తెలియదు," అన్నాడు సిల్వరు.

అదంతా విన్నాక అసలు విషయం దాచడం అనవసరమని ఎందుకో తోచింది. ఆ ఓడని తీసుకపోయింది నేనే నని చెప్పేను, అదొకచోట దాచేనని, ఏమయింది చెప్పననీ అన్నాను. సిల్వరు నోరు తెరిచి, చూసేడు. నేను అంతతో ఆగలేదు. ఓడ దీవికి చేరినవెనుకటి రోజున వాళ్ల కుట్ర, ఆలోచనలన్నింటినీ విని కేప్టెన్‌కు చెప్పడందగ్గిర నుంచి అన్నీ చెప్పేను. దానితో వింటూన్న దొంగలందరికీ కోపం వచ్చింది. నామీదకి కత్తులు తీశారు. కాని సిల్వరు వాళ్లని ఆపేడు. వాళ్ల కోపం అతనిమీదకుకూడా తిరిగింది ఏం చెయ్యాలో చించుకొనేటందుకు మిగిలినవాళ్లంతా ఇసకలోకి పోయారు.

సిల్వరు తన ఎత్తులన్నీ భగ్నం కావడానికి కారణమయిన నన్ను చంపెయ్యకుండా ఎందుకు ఆపేడా అని మొదట నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఆ కారణం ఏమిటో మిగిలిన దొంగలు గది వదిలి వాకిట్లోకి పోగానే తెలిసిపోయింది. తన ఎత్తులన్నీ విఫలం అయినాయి. ఓడ పోయింది. ఎక్కడ ఉందో తెలియదు. తెలిసినా ఈదీవినుంచి బయటపడడం అసాధ్యం. కనక కెప్టెన్‌తోనూ,

---

మధ్యలో కలుసుకొన్నప్పుడు ఎంతో సంతోషంగా ఉంటుంది" అని కథ ముగించింది మేరి.

పిల్లలందరూ పెద్దయితే లండను నగరం తప్పక చూచి, ఆ రైళ్లలో ప్రయాణం చేయాలని నిశ్చయించుకొన్నారు.

డాక్టరుతోనూ మంచిమాట చేసుకోవాలి. దానికై నన్ను అతడు హామీగా ఉపయోగించుకోదలిచాడు. ఆరహస్యంకాస్తా మాటలలో బయటపడింది. తననుగూర్చి కెప్టెన్‌కు సిఫారుసు చేయమనడంతో అర్థమయింది.

సిల్వరు తెలివి మిగిలిన వాళ్లకేదీ? వాళ్లంతా వాకట్లో కూర్చుని చాలాసేపు ఆలోచించారు. ఆఖరికి అందరూ కట్టగా సిల్వరుఎదటికి వచ్చి నిలబడ్డారు. వారిలో ఒకడు నల్లని మచ్చ ఉన్న కాగితం ఒకటి తీసి, సిల్వర్‌కి ఇచ్చేడు. దానిరెండో వైపున అతనిని కెప్టెన్ హోదానుంచి తప్పించివేసినట్లు వ్రాసిఉంది. ఆ నల్లనిమచ్చా, కాగితమూ చూస్తే ఇంతకుముందు గుడ్డివాడు కెప్టెన్ బిల్‌కి ఇచ్చిన కాగితం గుర్తుకు వచ్చింది.

"నన్ను ఎందుకు తొలగించవలసివచ్చిందీ ?" అని సిల్వర్ ప్రశ్నించాడు.

"ఓడమీద ఎన్నో పెద్ద కబుర్లు చెప్పి, తీరా సమయం వచ్చేసరికి పని పాడుచేశావు. తరువాత డాక్టరుతో సంధిచేసుకుని వాళ్లని బయటకు పోనిచ్చేవు. వెళ్ళిపోయేటప్పుడు మేము చంపుతామన్నా చంపనియలేదు. మనకి ఎంతో నష్టం చేసిన ఈ కుట్టువాడిని చంపనియ్యలేదు. ఈ కారణాలచేత నిమీద మాకు విశ్వాసం లేదు. మేము మరొకరిని నాయకుణ్ణిగా ఎన్నుకుంటాం"

సిల్వరు తెలివికి, గోడు మంచి మాటకారితనం గలవాడు. తన మాటకారితనంతోనే అతడు వారిచేత ఆ అభిప్రాయాన్ని మార్చుకొనేటట్లు చేశాడు.

"నేను తొందరపడి తిరగబడవద్దని గోలచేసినా మీరు వినలేదు. సమయం రాకపూర్వమే గొడవచేసి ఇంతవరకూ తెచ్చేరు. అందులో నా తప్పు లేదు. ఇంక ఈ కుట్టువాడిని చంపకుండా అడ్డుపడడంగురించి ఈతడు మనచేతిలో హామీగా ఉంటే కెప్టెన్‌తోటీ వాళ్లతోటీ బేరంపెట్టవచ్చు. అన్నీ చెడివస్తే మనకి మిగిలేదారి అది ఒక్కటే. డాక్టరునీ వాళ్లనీ చంపనియ్యకపోవడాన్నిగురించి కూడా అల్లాంటికారణమే ఉంది. ఆయనను మీరు చెప్పినట్లు చంపెయ్యనిస్తే మన గాయాలకు కట్లు కట్టేదెవరూ? రోగాలకు మందు లిచ్చేదెవరూ ? అందుచేతనే వాళ్ళని చంపనివ్వలేద. ఇంక సంధిచేసుకున్నానని కాదూ నామీద నేరం మోపేరు. నిజమే. ఇదిగో నేను దీనికోసంసంధి చేసుకొన్నాను" అంటూ సిల్వరు ఆదీవిలోని నిధినిక్షేపాలమ్యాపును వారిముందర పడవేశాడు.

బెంజమిన్ నిధిని తవ్వుకొనిపోయాడు గనక మ్యాపు ప్రయోజనంలేదని డాక్టరు దానిని వీళ్ల మొహాన పడవేసి వెళ్లిపోయాడని గ్రహించాను. కాని, నే నేమీ అనలేదు.

మ్యాపు అందరిచేతులలో ఒకమారు తిరిగింది. దానిని చూశాక అందరూ చల్లబడ్డారు. ఈమారు బిగుపువంతు సిల్వరుది. తనకెప్టెన్ పదవిని వదులుకుంటున్నానని చెప్పి వారిచేత బతిమలాడించుకొంటేనే గాని మళ్ళీ అంగీకరించలేదు.

ఆ రాత్రి గడిచిపోయింది.

మర్నాడు ప్రొద్దుటే డాక్టరు వచ్చాడు. అందరినీ పరీక్షించాడు. తర్వాత సిల్వరుఅనుమతితో నాతో మాట్లాడేడు. మొదట ఆయనకు నాయెడ కొద్దివిముఖత ఉన్నా నేను చెప్పినదంతా విని, నన్ను బుజ్జగించాడు. ఓడను దాచిన చోటు ఆయనతో చెప్పేను. ఆయన సిల్వరును పిలిచి, నన్ను జాగ్రత్తగా చూడమని వప్పగించాడు. నామీదనే అతనిబ్రతుకు ఆధారపడి ఉందని చెప్పేడు. సిల్వరు తల ఊపేడు.

డాక్టరు వెళ్ళిపోగానే దొంగలందరూ నిధికోసం బయలుదేరేరు. నానడుముకుపోసిన పగ్గం చేతబట్టుకుని సిల్వరు నడుస్తున్నాడు. మ్యాపుడు అనుసరించి, వారు గుర్తులు వెతుక్కుంటూ బయలుదేరేరు.

"పెద్దపర్వతపు శిఖరంమీద నున్న చరియలో ఎత్తయిన చెట్టు. కొండకొమ్ము. ఈశాన్యంగా కనబడుతుంది. ఎముకల దీవి. ఆగ్నేయంగా కనబడుతుంది. దానికి పది గజాలదూరంలో......"

మేము మొదటిరోజున వచ్చినపుడు ఓడను లంగరువేసినచోటికి ఆవలిభాగంలో ఒక చిన్న దీవి ఉంది. దానిపేరు ఎముకలదీవి. నిధి సమీపంలోని పెద్ద చెట్టుదగ్గర నిల్చుంటే ఆదీవి ఆగ్నేయంగా కనబడుతుందన్నమాట. దొంగలు అటువంటి మహావృక్షాన్ని వెతుక్కుంటూ తిరుగుతున్నారు.

నిధి ఉన్నచోటు సమీపించినకొలదీ సిల్వరు అభిప్రాయాలలో

కాఠిన్యం ప్రతిబింబింపసాగుతోంది. చూపులతోనే మా డ్చేసేలా గ చూస్తున్నాడు. మాట మాటకూ గుంజుతున్నాడు. అతని ధోరణి చూస్తే నాకు భయం పుట్టింది. నిధి అంటూ కనిపిస్తే ఇంక నాకు ప్రాణాలు దక్కవనిపించింది. అయితే మాత్రం చేసేదేముందీ ?

ఇంతలో ఆ అడవిలో ఏవైపు నుంచో వాళ్లు ఎరిగిన గొంతుకా, ఎరిగిన పాటా వినిపించాయి. ఒక్కమారు అందరూ వణికిపోయారు. గొంతుక, ఆ పాట చచ్చిపోయిన కెప్టెన్ ఫ్లింట్‌ది. ఫ్లింటు దయ్యమయి ఆ నిధిని కాపాడుతున్నాడనీ, ముందుకు అడుగు వేస్తే చావు నిజమనీ వణికిపోయారు. వారికి భయం పోగొట్టి, నిధికోసం బయలుదేరతియ్యడానికై సిల్వరు ఎన్నో ప్రయత్నాలు చేశాడు. దయ్యపుగొంతుకకి ప్రతిధ్వని ఉండదనే నమ్మికను వారికి జ్ఞాపకం చేశాడు. ఈధ్వని కొండకొమ్ములలో ప్రతిధ్వనించడం అందరూ విన్నారు. కాస్త ధైర్యం చిక్కింది.

ఇంతలో మళ్లీ అదే స్వరం వినబడింది. ఈమారు సిల్వర్ ఆగొంతుకను ఆనమాలు పట్టేశాడు.

"అది బెన్‌జమిన్ గన్ గొంతుక. ఫ్లింట్ కాదు."

వాళ్లకి గన్ అనినా, గన్ యొక్క దయ్యం అనినా కూడా భయం లేదు. అందరి మొగాలు తెరిపిన పడ్డాయి. మళ్లీ బయలుదేరేరు. అయిన ఆలస్యం కూడదీసుకొనేటందుకై అందరూ వేగంగా అడుగులను వేశారు.

అందరం చరియకు చేరుకున్నాం. అక్కడ అన్నింటికన్న పెద్ద ఎత్తయిన చెట్లు మూడున్నాయి. వాటిలో ఏచెట్టు దగ్గర ఉందో నిధి ? దిక్సూచిసహాయంతో వాటిలో ఏచెట్టు గుర్తులకు సరిపడుతుందో పట్టుకున్నారు. అందరూ



నిలబడ్డారు. మళ్లీ పదిగజాలు ముందుకు నడిచేరు. ఎదుట పెద్ద గొయ్యి, గోతిలో పగలగొట్టబడిన పెట్టెలూ కనబడ్డాయి. అంతా ఆతురతగా గోతిలో దిగేరు. పెట్టెలు అటూ ఇటూ తోసేరు. మన్నులో చెదిరిపడ్డ నాణాలు ఒకటో, రెండో మాత్రమే ఉన్నాయి. మిగిలిననిధి అంతా అక్కడనుంచి తరలింపబడింది.

అందరినోటా ఒక్కమారుగా దుఃఖమూ బాధా ప్రకటిస్తూ "ఎవరో ఎత్తుకుపోయారు" అన్న వాక్యం వెలువడింది. మరుక్షణంలో వారికళ్లల్లో క్రోధాగ్నిజ్వాలలు కనిపించాయి.

నిధిలేని వట్టిగోయి కనిపించగానే సిల్వరుధోరణి అంతా మారిపోయింది. నిధి తాము అనుకొన్నట్లు దొరకకపోవడంచేత మిగిలిన దొంగలు నన్ను చంపడానికి సిద్ధమౌతారని ముందే గ్రహించాడు. నావిషయంలో అతడంతవరకూ చూపుతూన్న కాఠిన్యం ఏమయిపోయిందో ఇప్పుడు ఛాయలన్నా లేవు. నెమ్మదిగా నన్ను తట్టి "నడుగట్టిక్కు. ఆవైపుకుచేరు. చంపేస్తారు." అన్నాడు. దొంగలు నలుగురూ పగిలిన పెట్టెలకింద చెదిరిపడిన నాణాలను వెతుక్కుంటూన్న హడావిడిలోనే మేమిద్దరమూ గట్టు ఎక్కేసేం. నిధి పోయినసంగతి గ్రహించి, మాకోసం తిరిగిచూసేంసరికి మేమప్పుడే గోతికి ఆవలివైపున ఉన్నాం. వాళ్లయిదుగురూ కేకలు పెట్టుకుంటూ బిలబిలా గోతిలోంచి పైకి వచ్చి, రెండోవైపున నిలబడ్డారు మమ్మల్ని. చంపడానికి తుపాకులు తీస్తున్నారు.

ఆ క్షణంలోనే మా వెనుకభాగంలో మూడు తుపాకులు ఒక్కమారు పేలేయి. మరుక్షణంలోనే ఇద్దరుదొంగలు చచ్చిపోయి, నిధిగోతిలోకి దొర్లిపోయారు. మిగిలిన వాళ్లు హడిలిపోయి, ప్రాణభయంతో పరుగెత్తిపోయి, చెట్లలో కనుమరుగైపోయారు.

తుపాకీచప్పుడుల వెనువెంటనే బెన్‌జమిన్, గ్రే, డాక్టరూ - ఈ ముగ్గురూ పరుగెత్తివచ్చారు.

వారితో నేనూ కలిసి, పారిపోతున్న వాళ్లని తరమడంలో పాల్గొన్నాను. చాలసేపు వాళ్ల వెంట బడ్డాం. కాని, ఒక్కడూ చిక్కలేదు.

ఇంతలో సిల్వరుకూడా మా వెనకే వచ్చాడు. అయిదుగురమూ ముందు సిల్వరుముఠా తాలూకు పడవలవద్దకు పోయేం. వాటిలో ఒక పడవను పగలగొట్టేశాం. రెండో దాంట్లో అయిదుగురమూ కూర్చుని మావాళ్లందరూ ఇప్పుడుంటూన్న వైపుకు బయలుదేరేం. మావాళ్లు ఇప్పుడు దీవికి ఆవలివైపున సముద్రానికి సమీపంగా ఉన్న ఒక కొండగుహాలో ఉంటున్నారట మా పడవ అక్కడికే బయలుదేరింది.

పడవలోకి ఎక్కేక డాక్టరు నేను ఆరోజుసాయంకాలం అదృశ్యంఅయినది మొదలు అంతవరకూ జరిగిన విషయాలన్నీ వివరంగా చెప్పేడు.

బెన్‌జమిన్ గన్ ఆదీవిలో దిగబడిపోయింది మొదలు నిధికోసం ఒక్కడూ తెగవెతికేడు. చిట్టచివరకు రెండుమూడునెలలక్రితం అది దొరికింది. వెంటనే అక్కడికి మూడునాలుగు మైళ్లదూరంలో దీవికి ఆవలిమూల నున్న ఒక కొండగుహాలోకి తరలించి దాచివేసేడు. ఆదీవికి వచ్చింది మొదలు అతడందులోనే ఉంటున్నాడు. అందులోనే ఇప్పుడు నిధిని దాచేడు.

మొన్నటిరోజున నాకన్న కొద్దిముందుగా బయలుదేరిన డాక్టరు గన్‌ను కలుసుకోవడానికి వెళ్లేడని చెప్పేనుకదూ? గన్‌తో మాట్లాడాడు. ఒప్పందపడ్డారు. నాలుక గీసుకొనేటందుకు కూడా పనికిరాకుండా పోయిన మ్యాపును సిల్వరుకి ఇచ్చేసి, వారంతా గన్‌కొండగుహాకే మకాం మార్చివేశారు.

డాక్టరు అల్లాగ చెయ్యడానికి కారణం లేకపోలేదు. నిధి పోయిన సంగతి డాక్టరు ఎరుగును. ఎంత తన్నుకున్నా దొంగలకది చిక్కదు. పైగా వాళ్ల ఓడకూడా పోవడం జరిగింది. ఈమారు దొంగలు దీవి వదలిపోవాలన్నా దారి లేదు. ఇంక అడవిలో కాచి, తమరిని ఆఇంటిలోనుంచి బయటకు రాకుండా కాల్చి చంపుతారు. ఆకొయ్యకోట బందిఖానా అయి ఊరుకుంటుంది. తర్వాత ఏనాడైనా వాళ్లకంట గన్ కనపడ్డాడా వ్యవహారం మరీ చెడుతుంది. ఇవన్నీ ఆలోచించి మావాళ్లు గన్‌గుహాకు మకాం మార్చుద్దామని నిశ్చయించారు. అక్కడకు చేరుతే నిధిని దగ్గరుండి కాపాడుకోవచ్చు. పైగా దొంగలు మాటుకాచి, చంపేటందుకు అక్కడ చోటులేదు. ట్రెలానీమిత్రుడు వచ్చేవరకు వేటమీద బ్రతుకుతే, తర్వాత నిధితో బయటపడవచ్చునని మావాళ్ల ఉద్దేశం. ఆ ఉద్దేశంతోనే నిన్న చేయిజారిన మాట చెప్పకుండా డాక్టరు మ్యాపును సిల్వరుకిచ్చి, సంధిచేసుకున్నాడు. ఆ కొయ్యకోటనుంచి మా వాళ్లు బయటపడ్డారు.

డాక్టరు పొద్దుటే నన్ను చూసి బయలుదేరేక మరొక చిక్కు ఎదురయింది ఆరోజున నిధికోసం దొంగలు బయలుదేరుతారు. పట్టిగొయ్యి కనబడగానే ఆ కోపంతో నన్ను చంపుతారు. నన్ను రక్షించడానికై సహాయం తెచ్చుకొనేందుకు డాక్టరు తమమకాంవైపు పరుగెత్తుకు పోయాడు. బెన్‌జమిన్నూ, గ్రేనూ తోడుతీసుకొని వెంటనే బయలుదేరేడు.

కాని, అప్పటికే ఎంతో ఆలస్యం అయింది. ఏవిధంగానైనా దొంగలు తమకన్న ముందు నిధిగోతివద్దకు చేరకుండా ఆపమని గన్‌ను అడ్డం పంపేడు. గన్ కొంతసేపు దయ్యంభయం కల్పించి, దొంగల్ని నిలువబెట్టడం చెప్పేనుగా. ఈ లోపున డాక్టరూ, గ్రేవచ్చి నిధిగోతికి సమీపంలో కాచేరు. గన్ వాళ్లని కలుసుకున్నాడు. నిజానికి గన్‌కి ఆ ఉపాయం తోచిఉండకపోతే వాళ్లు తప్పకుండా నన్నూ, సిల్వరునూ చంపేసే ఉండేవాళ్లు.

మొట్టమొదట మాపడవను నేను 'హిస్పనోలా'ను దాచిన కయ్యలోకి పట్టించేరు. ఓడ నేను వదిలిపోయిన చోటనే మెరకపట్టిఉంది. గ్రే, బెన్, సిల్వరు, డాక్టరు కలిసి దానిని మెరకమీదినుంచి లోతునీటిలోకి తోసి, లంగరు వేసేరు. తెరచాపలు సర్దేరు. దానిమీద కాపలాకోసం గన్‌ను ఉంచి, మిగిలినవాళ్లందరం అక్కడకు దగ్గరలోనే ఉన్న బెంజమిన్ గుహాకు వెళ్లేం.

కెప్టెనూ, ట్రెలానీ నన్ను ఎంతో ఆదరించారు. చెప్పకుండా ఎక్కడికో వెళ్లిపోయిన తప్పిదాన్ని వాళ్లు ఎవ్వరూ తడవలేదు. పొడుగునా

నేను వాళ్లదగ్గర ఉన్నట్లే మూట్లాడేరు. కాని, సిల్వరును మాత్రం ఈసడించారు. నేనే కొంతగౌరవం చూపేవాడిని కాని మిగతావాళ్లు అతనిని కుక్కను చూసినట్లు చూసేరు. గన్‌కి సిల్వరంటే ఉన్న భయంకొద్దీ ఏమీ అనేవాడు కాదు. అంతే.

మావాళ్లు చూపిన అనాదరాన్ని సిల్వర్ లెక్కచేయలేదు. మానాభిమానాలు దేహమునకే గాని ఆత్మకు గాదనే వేదాంతం వంటబట్టినట్లూ, ఏమీ జరగనట్లూ వ్యవహరించాడు.

మర్నాడే బంగారాన్ని గుహాలోనుంచి ఓడలోకి ఎత్తించడానికి పూనుకున్నాం. అడివిలోకి పారిపోయిన దొంగలు సమీపానికి రాకుండా ఎదుట కొద్దిదూరంలో ఉన్న గుట్టమీద తుపాకీ ఇచ్చి ఒక మనిషిని కాపలా పెట్టేం. ఇంక గుహనుంచి బంగారం మొయ్యడం సాగించాం.

క్రమంగా గుహాలో ఉన్న బంగారం అంతా ఓడకి చేరింది. బెన్‌జమిన్ తాను తినడానికి నిలవచేసుకున్న మాంసాన్ని ఓడకెత్తించాం. మంచినీళ్లు చేర్చేం. ప్రయాణానికి సరంజామా అంతా పూర్తిఅయింది.

దీవిలో మేము వదిలిపోతూన్న దొంగలు ముగ్గురికీ ఇంత తుపాకీ మందూ, రవ్వలూ వదిలిపెట్టేం. వాళ్లు ఏకొండగొర్రెనో కొట్టుకుని బ్రతుకుతారు.

ఆవిధంగా మా పనులన్నీ పూర్తి అయాక లంగరు ఎత్తేం. ఓడ కయ్యను వదిలి సముద్రంలోకి వచ్చింది.

అంతవరకూ పారిపోయిన దొంగలు ముగ్గురూ దగ్గరగానే మాటున ఉండి చూస్తున్నారు కాబోలు. మా ఓడ బయలుదేరగానే పరుగెత్తి వచ్చి, ఇసకలో మోకరిల్లి, దండాలు పెట్టి, తమని కూడా తీసుకువెళ్లమని ఏడ్చేరు. మాకూ జాలి పుట్టింది. కాని, ఆ జాలి వాళ్లకే నష్టం. రేవుకు చేరిన వెంటనే ఓడమీద తిరుగుబాటు చేసినందుకై వాళ్లని విచారణచేసి, ఉరితీస్తారు. వాళ్లమీద దయకొద్దీ దేశం తీసుకుపోయి ఉరితీయించే కన్న, అక్కడ వదిలిపోవడమే మంచి దనుకొన్నాం. ఏమేం సరుకులు ఎక్కడెక్కడ వదిలిపెట్టేమో గొంతు చించుకొని చెప్పేము.

కాని, వాటిని వాళ్లు వినిపించుకుంటేనా? కొంతసేపు ఏడ్చి, మొత్తుకున్నారు. ఇంక లాభం లేదనుకొని, నిరాశతో, క్రోధంతో మా ఓడమీదికి తుపాకులు కాల్చి, పారిపోయారు. వాటివలన ఎవరికీ గాయాలు తగలలేదు. మాఓడ మంచిగాలివిసురుకి సముద్రాన్ని చీలుచుకుంటూ ప్రయాణం ప్రారంభించింది.

కొన్నాళ్లకి మా ఓడ అమెరికాలో ఒక రేవుకి చేరుకొంది. కొత్త కళాసులని చేర్చుకుంటేనే కాని అట్లాంటిక్ మహాసముద్రం దాటడం శక్యం కాదు. ఓడ రేవుకు చేరుకోగానే డాక్టరూ కెప్టెనూ ఊళ్లోకి మనుష్యులకోసం వెళ్ళేరు. ఎవరూ లేని సమయం చూసి, సిల్వరు ఒక పెట్టె పగులగొట్టి మూడు, నాలుగు వందల నవరసులు తీసుకుని ఓడ దిగి పారిపోయాడు. ఆ వార్త తెలిశాక మేము శని వదిలిందనుకున్నాం. మళ్లీ కొత్తమనుష్యులతో మా ఓడ అట్లాంటిక్కుకు అడ్డుబడింది.

క్రమంగా కొద్దివారాలకు మాఓడ ఇంగ్లండు చేరింది. అప్పటికప్పుడే ట్రలానీ మిత్రుడు మేము రాలేదేమని కంగారుపడుతున్నాడు. మాకు సహాయంగా పంపడానికి వేరొక ఓడను సిద్ధం చేస్తున్నాడు.

బ్రిష్టల్‌కు చేరగానే ట్రలానీ అనుకున్న రీతిగా నిధిని పంచిపెట్టేడు. గ్రే తనవాటాడబ్బుతో ఒకఓడలో వాటా కొనుక్కొని గౌరవంగా కాలక్షేపం చేస్తున్నాడు. బెన్‌జమిన్ తనవాటాకు వచ్చిన వెయ్యినవరసులనూ పదిరోజులలో తాగేసి, అడుక్కుందుకు బయలుదేరేడు, అమెరికా రేవులో అదృశ్యమైన సిల్వరు పేరు మళ్లీ వినబడలేదు. అతడు తన మిగతాజీవితం ఏలాగ గడిపేడో? ఎవరికీ తెలియదు.

[సమాప్తం]

# హైదరాలీ

సింగరాజు వెంకట హనుమంతరావు

దక్షిణ హిందూస్థానములో మైసూరు చాలపెద్దరాజ్యము. చాలకాలము క్రిందట మైసూరు రాజ్యములోని యొక గ్రామములో భాగమ్మ యనెడి యొక బ్రాహ్మణ స్త్రీ నివసించుచుండెను. ఆమె యింటిలో హైదరనెడి యొక మహమ్మదీయ నౌకరుండెడివాడు. ఆమె యింటిలో చాకిరీ అంతయు హైదరే చేసేవాడు. ఆమె బిడ్డలకు స్నానము చేయించేవాడు. వారికి వస్త్రములను ధరింపజేయువాడు. బజారునుండి సకలమైన వస్తువులూ తెచ్చెడివాడు. ప్రక్కలు పరచెడివాడు. ఒకటేమిటి, సకలమైన చాకిరీ చేసెడివాడు. ప్రతి పనినీ, ఎంతో సంతోషముతో హృదయపూర్వకముగా చేసెడివాడు. యజమానురాలైన భాగమ్మగూడ నాతనియెడల పుత్రప్రేమ కనబరిచెడిది. ఆమె హైదరుని తనకుమారులలో నొకనినిగా చూచుకొనెడిది. ఏవిషయమునగూడ నాతని కేలాంటి కొరత లేకుండ చూచెడిది. హైదరుగూడ భాగమ్మను తనతల్లితో సమానంగా తలంచెడివాడు. ఆమెను 'అమ్మా'యని పిలచెడివాడు గూడాను.

హైదరు బాల్యమునుండియు తుంటరివాడు. చిలిపిచేష్టలలోనే పెరిగినాడు. భయమంటే యేమిటో యాతడెరుగనే యెరుగడు. యువకుడు కాగానే మైసూరుసంస్థానములో యొక సైనికుడుగా చేరాడు. ఆతడు సైనికుడుగా చేరినతరువాత చాలగొప్పసాహసకార్యము లొనరించినాడు. ఇందువల్ల నాతనివేతనము, హోదా హెచ్చిపోసాగినాయి.



ఒకనాడు సర్వసేనానియైనాడు. ఆకాలమున మైసూరుసంస్థానములో హైదరువంటి సాహసవంతుడు, ధైర్యశాలి దొరకుట దుర్లభముగా నుండెడిది. ఇందువల్లనే యాతడొకనాడు మైసూరుసంస్థానానికే రాజైనాడు.

రాజైతే అయినాడు గాని ఆతడు తనబాల్యాన్ని విస్మరించలేదు. తనను భాగమ్మ స్వంతకుమారుని వలె అత్యంతప్రేమతో చూచెడిది. తన కెంత బాగా యేలాంటికొరతయు లేకుండా; లాలించి, ఆదరించి, రక్షించిందో హైదరు మరచిపోలేదు. ఎలా మరువగలడు మరి ?

మైసూరు సింహాసనాసీనుడైన పిదప నాతడు తన పెంపుడుతల్లి భాగమ్మను చూడవలయునని నిశ్చయించుకొనెను. కావలసినంత ధనము, పట్టుపీతాంబరములు మున్నగు కానుకలను ఒంటెలపై వేసి, భాగమ్మ నివసించెడి గ్రామమువైపునకు బయలుదేరెను.

హైదరాలీ ససైన్యముగా బయలుదేరెను. ఆయనవెంట దర్బారులోని ధనవంతులు, సరదారులునుండిరి. వారు తమలో తామే తలంచుచుండిరి– "యెక్కడికి పోతున్నాడీ పాదుషా?" యని. కొంతమంది– "ఎవడోశత్రువునులోబరచుకొనుటకీ ధనమును లంచముగా గైకొని పోవుచున్నాడ" నుకొనిరి. కొందరు "వేటకువెళ్ళుచున్నా" డనుకొనిరి. ఇట్లేప్రతివాడును తనలో తాను తనకు తోచినరీతిగా తలంచి, పాదుషా వెంటనే వెళ్ళుచుండిరి. "తమ రెచ్చటకు వెళ్ళుచున్నారు?" అని పాదుషాను అడిగేటంత ధైర్య మొక్కరికిని లేకపోయినది. పోయిపోయి పరివార

మంతా భాగమ్మ నివసించెడి గ్రామము చేరుకుంది. పాదుషా తన మావటివానితో ఒకదారివైపు చూపిస్తూ ఆజ్ఞాపించాడు-." ఇదియే వెళ్ళవలసిన దారి. ఏనుగు నీవైపునకే త్రిప్పు"

ఏనుగు వెంటనే అటువైపు మరలించబడినది. దాని వెంటనే అందరూ గ్రామవీధులగుండా వెళ్ళుచుండిరి. ఒక చిన్నిగృహమును సమీపించగానే పాదుషా హైదరాలీ ఆజ్ఞాపించాడు-"చాలు ఇంక ఆగండి !"

మావటివాడేనుగును నిలిపివేసినాడు. హైదరాలీ అంబారీనుండి క్రిందకు ఒక్క వురుకు వురికినాడు. సరదారులందరును విస్తుపోయి, రెప్పవేయక చూడసాగిరి. హైదరాలీ నెమ్మదిగ 'ద్వారమును సమీపించి, దానిని తట్టసాగినాడు. లోనుండి ప్రశ్న వినిపించినది- "ఎవరయ్యా అది?" పాదుషా జవాబు చెప్పినాడు-"తమ ప్రాతసేవకుడు హైదరు తమర్ని చూడవలెనని వచ్చియున్నాడు?"

తలుపు తెరవబడినది. ముసలి బ్రాహ్మణి భాగమ్మ వెలుపలికి వచ్చినది. హైదరాలీని, ఆయాడంబరపురాచదుస్తులతో చూచి ఆమె గుర్తింపజాలకనే పోయినది. అపుడు పాదుషా హైదరాలీ చేతులు జోడించి స్వయముగనే చెప్పినాడు-"అమ్మా ! నేను మీ ప్రాతసేవకుడు హైదరుని. ఈ కానుకలన్నియు మీకొరకే నేను తెచ్చినాను. మీరు నాయెడల చూపించిన పుత్రవాత్సల్యముముందు, నాకు చేసిన అమోఘ, అమూల్యసహాయములముందీ కానుకలు తీసికట్టు. అయినా కొండంత దేవునికి కొండంత పత్రి తేగలమా? నాశక్త్యనుసారం తెచ్చినాను. దయతో అనుగ్రహించు."

భాగమ్మనేత్రాలు ఆనందబాష్పపూరితములైనవి. ఆమె ప్రేమతో హైదరాలీ తల పుణికిగొన్నది. పుత్రప్రేమ పుట్టిపడుచుండగా, హైదరు నాశీర్వదించింది "నాయనా ! నీ కృతజ్ఞత ప్రశంసాపాత్రమైనది. చిరంజీవివై జీవించు. నీ రాజ్య మితోధికముగ విస్తరించుగాక ! నీవు మైసూరునకే గాదు. యావద్భారతభూమికి పాదుషాయౌదువుగాత !"

---



బ్రిటన్ అమెరికాల పర్యటనకు బయలుదేరుతున్న భారతప్రభుత్వ ఆడిటర్ జనరల్ శ్రీ వి. నరహరిరావుగార్కి బొంబాయి శాంటాక్రజ్ విమాన కేంద్రంలో వీడ్కోలులు

# రుద్రమదేవి

(15-వ పేజీ తరువాయి)

జింగని సేనలు దారిలో వేయుచు పోయిన ప్రథలే అట్టివారు స్వీకరించి చెప్పుచుండిరి.

మరి యిక నాతని జయించిన పాండ్యసేనల సంఖ్య ఎంత? అది యసంఖ్యాకమే యనియు శ్రీరాముని వానరసేనలవలెనే కోట్ల సంఖ్యలతో నున్నదనియు వాడుకలు ప్రబలెను. వాని నిజానిజములు తెలిసికొను టెట్లు?

ఇంత మహాసైన్యములను నవలక్షధనుర్ధరులు మాత్రమే కల కాకతీయసేన లెదుర్కొనగలవా? అందుకు ఇప్పుడు గణపతిదేవులు వృద్ధులైనారు; వారి దుహిత రుద్రమ రాజ్యభారము వహించినది. పురుషనామము వహించినంతమాత్రమున స్త్రీకి పౌరుషము వచ్చునా? అదియు గాక నామె భర్తయే యామెను ప్రతిఘటించుచున్నాడు; ఆమెకుమారులే వ్యతిరేకమయిరి; సమర్థులగు పలువురు మండలేశ్వరు లెదురుతిరిగిరి. పైనుండి ఒకవైపున కళింగసేనలు, మరియొకవైపున కాడవపాండ్యసేనలు రాజ్యములోనికి చొచ్చుకొని వచ్చినవి. తమకు చేరిన రహస్యవార్తలను బట్టి యొకవైపునుండి హొయిసలబల్లాలసేనలును మరియొకవైపునుండి దేవగిరియాదవసేనలును కాకతీయసామ్రాజ్యముపై శీఘ్రముగా దండెత్తనున్నవి. కాకతీయసామ్రాజ్యము మునుగుటకు సిద్ధముగా నున్న నాకవలె నున్న దిప్పుడు! ఆత్మరక్షణ చేసికొనగోరువారు దానిని ఎంత శీఘ్రముగా త్యజించిన నంత మేలు! ఈ విధముగా వారు మంతనములు చేయుచుండిరి.

ఈ మధ్య చాలకాలముగా బొల్లడు గుంటూరులోననే ఉన్నాడు. అత డిప్పుడు గొంటూరు నాగదేవుని దక్షిణహస్తము! అతని దేహమునకు వెనుక నుండెడి స్థౌల్యము కొంత తగ్గినది. ఇప్పు డాతడు ఖడ్గసాధనమునను బాణప్రయోగమునను శూలాద్యాయుధవిద్యలను చతురుడు; ఆరితేరిన యాశ్వికుడు. శతములను సహస్రములను యోధులను చాకచక్యముతో నడిపింపగల సమర్థుడు. నాగదేవుని మూకలతోగూడి యాతడు విశేషధన మార్జించియుండెను. ఎందరో స్త్రీ లాతని నాకర్షించి తమ వలలో వేసికొనజూచిరి. కాని యాతడు స్త్రీలవంక కన్నెత్తి చూడడు. స్త్రీముఖము ప్రమాదవశమున నాతనికంట బడినచో నాతడు భయపడి పారిపోవ యత్నించువానివలెనే యుండును.

ఇదియే కాక అతనిలో కొన్ని విపరీతమైన గుణములు కలవు. జనమధ్యమున నందరు సల్లాపముగా నున్నప్పు డాతనికి నడుమనడుమ గుబులువలె ఆవేశించును. అప్పు డత డెవ్వరితోడను మాటాడడు. ఎవరైన పలుకరించిన చీదరించుకొనును. అంతలో నాతడు భయపడుచున్నవానివలె బెదరు చూపులు చూచుచు పారిపోవును. అతని కున్మాదమా?

వైకుంఠైకాదశిసాయంకాలమున జగన్నాథస్వామియాలయమునందు కర్ణాటదేశమునుండి వచ్చిన యొక వేశ్యల మేళము నాట్యముచేయుచుండెను. దానికి నాగదేవుడును అతని మిత్రులును ఆహూతులై వచ్చియుండిరి. నాగదేవునితో బొల్లడును వచ్చి గౌరవాసనమున నాసీనుడయ్యెను.

ఆ మేళమునుండి యిద్దరు వేశ్యలు ముందుకు వచ్చి గొండ్లి సలుపుచుండిరి. వారిలో నొకతె మాటిమాటికి బొల్లనిపై తన కటాక్షములు పరపసాగినది. అది చూచిన యచ్చటి సామాజికులు ముసిముసినవ్వులు నవ్వసాగిరి.

బొల్లనిముఖము పాలిపోయెను. ఆకస్మికముగా నాతని దేహము బిగిసికొనిపోవుచున్నట్లయ్యెను. అత డా నట్టువకత్తెవంక తదేకదృష్టితో చూడసాగెను.

మరల నంతలో నాతనిలో పెద్ద మార్పు వచ్చెను. లాగిపట్టిన కళ్లెము వదలినచో పరుగువారు నశ్వమువలెను, అనకట్ట తెగిపోయిన నదీప్రవాహమువలెనే అతడు చూడనయ్యెను. సభలోనుండి యాత డాకస్మికముగా లేచి, శీఘ్రముగా నాగదేవునికి నమస్కరించి సెలవు తీసుకొని, ఆ చీకటిలో నొంటరిగా వెడలిపోయెను. అతని యున్మాద మందరు నెరిగినదియే గనుక నెవ్వరు నేమియు ననలేదు.

అత డొంటరిగా నరణ్యమధ్యముగుండ పోయి పోయి యక్కడికి క్రోశముదూరమున నున్న నల్లచెరువుకట్టకు పోయి, దాని మరుగొమ్మ నాతడు చేరికొనెను. ఆ చెరువుకు దూరమున నున్న కొండలపై కురిసిన వర్షపునీరు నల్లనేలగుండ పారుచు వచ్చి ఆ చెరువులో కలయును. ఆ నీటిరంగుచే దానికి నల్లచెరువని పేరు వచ్చినది. ఇది చాల పెద్దచెరువు. దీని నీటిక్రింద కొంతభూమి దక్షిణభాగమున పల్లపుసాగు చేయబడుచున్నది. అక్కడ పండు వరి మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈ చెరువు నిండగా మిగిలిన నీరు, ఆ మరుగొమ్మగుండగా అవల నొక క్రోశముదూరమున నున్న బుడంపాడుచెరువులోనికి చేరుకొనును.

బొల్లడు తరుచుగా ఒంటరిగా చేరికొనునది ఆ మరుగొమ్మ సమీపమునకే! అక్కడికి ఎవ్వరును రాత్రులు రారు. అక్కడ పెద్ద చింతలును, మర్రిచెట్లును, టేకుమ్రానులును క్రమ్ముకొని భయంకరముగా నుండును. రాత్రు లక్కడ కీచురాళ్లధ్వని చెవులకు గింగురుమనును. గొంటూరిలో ననాదిగా కబోదిపక్షు లెక్కువ. ఈ పక్షులు అన్నిగ్రామములను ఉండవు. అవి ఎక్కడ నున్నను గుంపులుగా కలసి నివసించును. అవి గబ్బిలములవలె చెట్లకు వ్రేలాడును. కాని గబ్బిలములకంటె మిక్కిలి పెద్దవి. వానికి ఎత్తుగా పెరిగిన చింతచెట్లెక్కువ యభిమానమగు స్థావరములు. ఆ చెట్లపై చూచిన పగ లెక్కువ కనిపింపవు. కాని సాయంత్ర మగునప్పటికి ఒక చిత్రమగు కీచునాదము చేయుచు నవి చెట్లకు వచ్చి వ్రేలాడును. అవి యప్పుడు చూచినచో ఆకున కొక్కటిచొప్పున నున్నట్లు కనబడును. ప్రొద్దుపోవువరకు వాని భయంకరసంగీతము సాగుచునేయుండును. తుద కవి నిద్రించును. రాత్రు లెప్పుడో తప్ప యవి యరవవు. మరల తెల్లవారుజామున ఆ నాదము ప్రారంభించును. చుట్టుప్రక్కల నర క్రోశమువరకు దానితో మతిగలవారికి మతులు చెడిపోవును. వర్షమునకు భూమిలోనుండి పగులబడి వచ్చి నాదముచేయు కప్పల బెకబెకలనే అది మించిపోవును. ఆ చెట్లచుట్టును వందలు వేలుగా నవి సంచరించుచుండును. దీనికంతటికి తాళమువలె నెదుర నల్లచెరువులో మధ్యమధ్య నెగిరిపడు పెనుమీలశబ్దము వినవచ్చును.

మతిగలవారికి మతిపోగొట్టు నీ మ్రోతలు మతిపోయిన బొల్లనికొక వింతశాంతము నొసగూర్చును. అతని పదము లీనాడును అప్రయత్నముగా నాతని నీ మరుగొమ్మనొద్దకే తీసికొనివచ్చినవి.

అతడు మరుగొమ్మకు పడమరదిమ్మపై కూర్చుండెను. దానికి సమీపముననే ఉన్న యొక చిన్న పల్లరేగుపొదపై నాతని దృష్టి వ్రాలినది.

ఆపాదక్రింపనే గొంటూరులో నాతనికి గల సర్వము నెత్తి

ప్తమైయున్నది. అందులో బంగారము వెండియే కాదున్నది, అమూల్యము లగు రత్నములు కూడ గలవు. స్త్రీల ముఖము చూచినప్పుడెల్ల ఆతనికి తనభార్య జ్ఞాపకమువచ్చును. దానివెంటనే కుమార్తె జ్ఞాపకమువచ్చును. వారితో చెప్పకుండ గూడ తానిట్లు పారిపోయివచ్చెను. వారు దారిద్ర్యముతో బాధపడుచున్నారను వార్తమాత్రము పూర్వము వచ్చియుండెను. వెంటనే తాను వారికి చేర్పగలందులకు సువర్ణము లెన్నియో పంపియుండెను. కాని యవి చేరినవార్త రాలేదు. భార్యయు పిల్లయు తలపున బారినప్పుడెల్ల ఈ ధనరాశి తలపున బారును. అతని కిప్పుడదియే భార్య, అదియే పిల్ల! అది చూచుకొని కొంత మనశ్శాంతి తెచ్చుకొనును.

కాని ఈ నాడాతని కట్టి మనశ్శాంతి కలుగలేదు. గొండ్లిలో తనవైపు చూపులు మాటిమాటికి పరపిన యువతి తానెప్పుడో హనుమకొండలోనో ఓరుగల్లులోనో చూచినదానివలెనున్నది. ఎంత ప్రయత్నించినను అతని కది ఎవరో జ్ఞప్తికి వచ్చుట లేదు. కాని యది తనవైపు కటాక్షము పరపినప్పుడెల్ల ఏకశిలానగర మాతనిమనస్సున స్పష్టముగా పారజూచ్చినది. ఏకశిలానగరమంతయు హృదయములో చిత్తరువువలె అంకితమైనది. ఆ నగరవీధులు తన హృదయములో గీతలుగీతలుగా పడి కోసివేయుచుండెను. ఆ గీతలు పోయిపోయి యాతనిగృహాంగణముముందు ఆగిపోవుచున్నవి. ఆ రేఖలుకోతల కాతని హృదయములో రక్తము స్రవించుచున్నట్లేయున్నదతనికి!

అంగులో•నాత డిప్పు డున్నది పాటిప్రదేశము. అక్కడ పూర్వ మేదో పల్లె యుండి పాడుపడియుండును. అక్కడ మట్టి పాటికి తిరిగియున్నది. మట్టి పాటిప్రదేశములు గొంటూరుచుట్టు నెన్నియేని గలవు — బుడంపాడు, కొంతపాడు, అనంతారపుపాడు, వేమల్లెపాడు, కొరిశెపాడు—!

ఈ పాటిప్రదేశములలో పూర్వ మెట్టి గ్రామము లుండెడివో; ఎట్టి మనుష్యు లుండినారో! ఎట్టి కష్టసుఖము లనుభవించియుండిరో? ఎవరైనను తనవలె కష్ట మనుభవించియుండిరో?

తన కుమార్తెపేరు పాటి? సజీవమై కలకలలాడుచు తన్ను ప్రేమాతిశయముతో పిలుచుచు కేరిసలాడుకూతురు 'పాటి'ని వదలి ఈ పాటిగడ్డను చూచి సంతోషించవలెనా? ఈ పాడుపాటి నేల. నా ముద్దులపాటికి ప్రతియా? ఛీ!

అతనికి కన్నీరు ఏకధారగా కారసాగెను. అప్రయత్నముగా నాతడు బిగ్గరగా నేడ్వసాగెను. ఎగయుటూర్పులతో మాటిమాటికి నాతడు 'పాటీ, పాటీ', యనుచును మధ్యమధ్య భార్యను తలచుకొని 'మంగీ'యనుచును తన ధనమెల్ల నిక్షేపించిన పాటిగడ్డను కౌగిలించుకొని రోదింపసాగెను.

"ఎందుకీ కర్మము నాకు పట్టినది!"

ఇట్లాతడు మనస్సున అనుకొనెనో, బిగ్గరగా ననుకొనెనో ఆతనికి తెలియదు. కాని దానికి ప్రత్యుత్తరమువలె ఈ రెండుమాటలును స్పష్టముగా వినవచ్చెను.

'ఆడసోకు!'

వేటువడిన పులివలెనే, కుబుసము విడిచిన త్రాచువలెనే, ఆత డొక్కమ్మడి లేచెను. నలుదిక్కులు చూచెను. ఎవ్వరును లేరు. తనమనస్సులోని భ్రాంతియే!

వెంటనే ఆతనికి నవరాత్రోత్సవప్రారంభదినమున తెను 'ఆడసోకు సోకినది' అని గణముపూనినట్లు నటించుట యెల్ల జ్ఞప్తికి వచ్చినది. ఆనాడు గండనితో పోరాటమును జ్ఞప్తికి వచ్చినది. ఈ పల్కినది అశరీరవాక్కు, నిజమే పలికినది. 'నాకీ కర్మ పట్టినందుకు కారణము ఆడసోకుగాడవయే!'

కాని తా నిప్పుడు వెనుకంజ వేయ వీలులేదు. ఎప్పటికైనను మంగిని.పాటిని ఇక్కడికి పిలిపించుకొనవలెను. కాని! ఎన్నాళ్లకు?

'ఎన్నాళ్లకు?' అని ప్రతిశబ్దమే వినవచ్చెను. మరల మొదట విన్న కంఠధ్వనియే! ఈ యశరీరవాణి సర్వజ్ఞముగా కనబడుచున్నదే! మరల ననుమానముతో దిక్కుల గలయజూచెను. ఎవరును గనపడలేదు. గుబురుగా కప్పియున్న చెట్ల సందులలోనుండి మధ్య మధ్య చంద్రకాంతి పడుచు, ఆ ప్రదేశమును తన్ను వెక్కిరించుచున్నట్లుండెను.

చింతచెట్లపై కబోదిపక్షులుకూడ నిశ్శబ్దమైనవి. అతడింకను విచారపరుడై యాలోచించుచుండెను. ఏకశిలానగరమే ఆతని హృదయములో పరివర్తనమగుచుండెను. ఇంటివైపు బుద్ధి మరలినది. ఈమారు మరల ఆకాశవాణి వినబడినది.

"బొల్లా?"

బొల్లనికి భయమ్ములేదు. అత డిట్లు ప్రశ్నించెను:

"ఎవరది?"

వెంటనే జవాబు వచ్చెను.

"నీ నేస్తము!"

బొల్లని కా కంఠ మిప్పుడు స్పష్టముగా గుర్తుకువచ్చినది. అది గండని కంఠము. తన ప్రాణశత్రువుకంఠము!

బొల్లడు తనయొరనుండి ఖడ్గము పెరికి యా శబ్దమువచ్చిన వైపుకు పోయెను. ఈమారు ఆవలదిక్కునుండి ధ్వని వినవచ్చెను.

"లాభము లేదు. నూరుగురు భటులు ఈ ప్రదేశమును చుట్టుముట్టియున్నారు. తప్పించుకొనలేవు!"

బొల్లడు నమ్మలేదు. వెంటనే ఒక ఈల వినబడెను. అనేక బాణము లొక్కసారి అకాశములోనికి పోయిన ధ్వని యయ్యెను. కబోదిపక్షులన్నియు లేచి చెట్లను ప్రదక్షిణము చేయుచు నరవసాగినవి. బొల్లడు కుప్పున కూలిపోయెను.

"నన్నొక్కసారిగా చంపివేయరాదా?" స్వర మిట్లు వినబడెను.

"నీతో పనియున్నది. దారిద్ర్యముతో బాధపడుచున్న మంగిని ఆకట నవసియున్న పాటిని చూచిన నేను నీపై కరకుదనము చూపలేకున్నాను!"

బొల్లనికి కన్నీరు ఏకధారగా కారెను. ఒకప్రక్కను కోపము వచ్చుచుండెను.

"నన్నేమి చేయుమందువు?"

"ముందా కత్తి విరిచి దూరముగా పారవేయుము!"

ఆ యాజ్ఞలు కుమార్తె పాటియు భార్య మంగియు చేయుచున్నట్లే యాతనికి తోచెను. వెంటనే అత డా పని చేసెను. మరల గండనివాక్కు వినవచ్చెను.

"దీనితో నా యర్ధరాత్రమున రహస్యమందిరములో ఖడ్గసాక్షిగా చేసిన ప్రతిజ్ఞవలన విడివడినావు!"

ఈ మాటలనుచునే గండ డాతని కెదురుపడెను. అప్రయత్నముగా నాతడు గండనిపైకి లఘింప కాలు కదల్చెను. కాని గండని యాకారము పరమశాంతముగా ధైర్యముతో నచలముగా నున్నది.

అది చూడగానే లేచుచున్న బొల్లనికాళ్లు భూమిలోనికి దిగబడి పోయెను.

గండడు ఆదరముతో నాతని కౌగిలించుకొనెను. బొల్లనికిని చిన్ననాటి ప్రేమ యొక్క సారిగ నుద్బుద్ధమైనది. అతడు పిల్లివలె గండని ప్రేమకు లొంగిపోయి బావురుమని ఏడ్వసాగెను. ఏడుపు తగ్గిన తర్వాత పాటిసంగతియు మంగిసంగతియు ఎన్నియో ప్రశ్నలాతడు వేసెను. నిశాచరయోగివెంటనంటిన రాత్రి వారి యింటియొద్ద జరిగినది గండడు కొంత యాతనికి చెప్పెను. అప్పుడు పాటికి వచ్చిన జ్వరము నెమ్మదియైనదని తాను అతర్వాత తెలిసికొనిన వార్తకూడ ఆతడు చెప్పెను.

బొల్లనికి గండని సర్వజ్ఞత ఎరిగినంతనే యాశ్చర్యమయ్యెను. పరమరహస్యముగా తాము చేసికొనిన ప్రతిజ్ఞ లెట్లు తెలిసినవి? తమలో నెవరైన తిరిగిపోయిరా?

ఆ పిమ్మట గండడు బొల్లని తనవెంట బయలుదేరమని చెప్పి తన పరివారమునకుగూడ వెంటరమ్మని యాజ్ఞాపించెను.

ఆనాటియర్ధరాత్రసమయమునకు గండడు బొల్లని వెంటగొని పోయి సమీపముననే కల కాకతీయస్కంధావారమున అంబదేవుని ముందు నిలువబెట్టెను.

అంబదేవుని సేనలు నిద్రించుచున్నవి. కాని యాతడు మేల్కొని దుద్బుద్ధుడైయుండెను. అతనిముందన్నియో పత్రము లున్నవి. పెద్దపటము నున్నది.

బొల్లడు నమస్కరించి నిలుచుండగనే, అంబదేవుడు ఆ పటము బొల్లనికి చూపి యెన్నియో ప్రశ్నలు వేసెను. తన్నాతడు బంధితునిగా గాక నిజసేవకునివలె చూచుచుండుట బొల్లని కాశ్చర్యమైనది. అతడును తడవుకొనకుండగ నా పరిసరము లన్నియు వివరించి చెప్పసాగెను.

"ఏలువమల్లిచోడ డెక్కడ? అతని పరివార మెంత? కేశవదేవుడు? అతని పరివారము? సోమిదేవుడు? అల్లుగంగు? మల్లికార్జునుడు? దామోదరుడు? నాగదేవుడు?"

ప్రశ్నల కన్నింటికి బొల్లడు ప్రత్యుత్తరము లిచ్చెను. కొంతవడికి అంబదేవుడు గండని సంబోధించెను:

"బొల్ల డిచ్చిన యుత్తరములు నిజము లని రేపు ధ్రువమైనచో నీమనవి విచారింతును. అంతవరకు నీతని దృఢముగా బంధింపుడు!"

---

# రష్యా ప్రపంచయుద్ధం ఆపేస్తుందా?

(13-వ పేజీ తరువాయి)

భద్రతకు పెద్దదెబ్బ. ఆటంబాంబు వేసినామనం, అంతచితికిపోము. ప్రపంచరాజ్యాలబలాబలాల ముగ్గులో మనది (అమెరికాది) క్రిందిచెయ్యి అయిపోతుంది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం నాటినుంచీ, రాజకీయంగా విస్తరణ చేకూర్చుకోవటమే రష్యా చేసినపని. అంగుళం మేర యుద్ధంవల్ల రష్యా తనలో కలుపుకోలేదు. యుద్ధంకన్నా ఆత్మప్రమాదరహితమైన పనుల వల్లే, రష్యా తన రాజకీయవిస్తరణను సమకూర్చుకుంటూ వచ్చింది. అటంబాంబు వున్నా ఈ సుకరమైన మార్గాలను రష్యా వదులుకో నక్కరలేదు.

దీన్ని జయించటానికి మనం ఇప్పుడు సాగిస్తున్న ప్రచ్ఛన్నయుద్ధమే మనకు తరణోపాయం. అంటే, ఇతరదేశాల ఆపదలూ, అవసరాలూ మనం చాలా మెలకువతో గమనిస్తూ రష్యాపక్షానికి చేరిపోవలసిన బెదరింపులకు వాళ్లు లొంగిపో నక్కరలేకుండా, తగినంత ఆర్థికంగానూ, ఇతరత్రానూ మనం సహాయం చేయాలి. మన సహాయంవల వీసమెత్తు ప్రయోజనం వుంటుందని తోచినా మన మే మాత్రమూ వెనుకాడకూడదు.

అక్కడి ఫలితాలు కూడా కేవలం మన సాహాయ్యంమీదే ఆధారపడి వుండవు. ఆ నేల, ఆ ప్రజలు ఇదికూడా లెఖ్ఖలోకి వస్తాయి. ఏమైనా, మనం అదనెరిగి జాగ్రత్తగా వాళ్లను కట్టుకొంటూ వస్తే ప్రయోజనం వుండక తప్పదనే ఈ మధ్య విషయాలు సూచించాయి.

మనం సాయుధుల మయ్యామా, "తటస్థులం"గా మిగిలామా, తక్కిన ప్రపంచం మరీ అధ్వానంగా చితికిపోతోంది. కాదని యుద్ధానికి దిగుదామంటే, ప్రజాస్వామ్యదేశాలకు యుద్ధం విదేశాంగనీతికి మూలకందం కాదు.

పోనీ సోవియట్ నాయకులతో 'అన్నిటికి ఒప్పుకొందాం' అన్నా, అది ప్రయోజనకారి కాదు. ఒకే మాటకు మన అర్థం వేరు. వాళ్ల అర్థం వేరు. ఇక పొంతన కుదరటం కష్టం.

## అమెరికా ఆత్మరక్షణ విధానం

కాబట్టి ఏదేశంలోనైనా, సైనికయుద్ధం ఎక్కడైనా అసంభవం చేయటం కుదరకపోయినా, అప్రస్తుతం ఆ యేర్పాటు చెయ్యాలి. యుద్ధం యితరులకు లాభదాయకం కానంతగా మన సైనిక స్వరూపం అట్టే వుంచాలి.

మాస్కో కమ్యూనిజంను ఎదిరించే స్నేహితులంతా మన సైనికబలం తమసైనికబలమే నన్న ధైర్యం ఉంటేనే గాని, సైనికంగా తమకు రక్షఉందని నమ్మకం వాళ్ళలో కల్గితేనే గాని, వాళ్ళు మనభద్రతకు కావలిసినంతగా మాస్కోను ఎదిరించలేరని జ్ఞప్తిలో ఉంచుకోవాలి.

స్వదేశాన్ని బలీయంచేసికోవాలి. ఇది కేవలం ఆర్థికాభివృద్ధి మాత్రమే కాదు. మానవవ్యక్తులముగా, ఈ పరపుష్టికి తగినంత ఉత్తేజనంతోనూ, అమెరికన్లము, పురోభివృద్ధి చెందుతున్నామని ప్రపంచానికి నిరూపించుకోవాలి.

ఇతరులపట్ల న్యాయం. సౌజన్యం సద్భావం చూపుతూ వ్యవహరించడంలోనే మనజాతి భద్రత ఇమిడిఉంది. ఈ విషయంలోనే, ఐక్యరాజ్యసమితి మనకు చాలా అక్కరకు రాగలదు.

ప్రపంచాన్నంతా మరామతు చేస్తామని డాబులకుపోవటం చాలాతప్పు. ప్రపంచంలో అన్ని నాగరికతలతోపాటు మనదీ ఒకటి అన్న వినయవిధేయతలతోనే, మన మనుగడ చూసుకోవాలి. ఇల్లా ప్రవర్తిస్తే, అంతర్జాతీయరంగంలో ఒకళ్లవల్ల వేలుపెట్టి చూపించుకోవలసిన భయం లేకుండా, మనమూ ధీమాగా తలఎత్తుకొని నిర్విచారంగా సద్యఃఫలితాలనూ, దూరఫలితాలనూకూడా సాధించుకొంటూ ఆదర్శాలనూ, ఆశయాలనూ మొక్కవోనీయ నక్కరలేకుండా, ముందుకు సాగిపోవచ్చును.

---

# అభిమానాలు

(11-వ పేజీ తరువాయి)

రాధకు తెలియలేదు...ఆమె శరీరమంతా దుఃఖంతో దహించుకుపోతున్నది. తను వెళ్లిపోతానన్నా కూడా, తన భర్తకి ఏమీ ఆటంకం లేకపోయింది. కనీసం, ఎందుకు వెళుతున్నావని అయినా అడగలేదు. తను యింట్లో లేకపోయినా, అతనికి కష్టం లేదన్నమాట! అతనికి తనమీద ఏమాత్రమూ జాలి, అభిమానము, లేదని ఇప్పుడు మరోకమారు రుజువైంది. ప్రేమలేని తనబతుకు వ్యర్థం – తన జీవితమంతా నిస్సారమని ఇప్పుడు తేలిపోయింది... తనవంట్లోని శక్తులు అన్నీ వీగిపోతున్నట్లుగా వున్నది...రాధ వెర్రిగా చెప్పుతూ అంది:

"కాని...కాని నేను వెళ్లిపోతానంటే మీరు వుండమనలేదు కదా?"

"నీఅంతట నీవే వెళ్లిపోతానంటే నే నేం చేసేది? వుండమనకపోడం మాత్రం నాతప్పా?"

"నేను వెళ్లిపోవడమే మీకు కావలసినది ...నేను లేకపోతేనే మీకు సుఖంగా వుంటుందని యివాళ తెలిసింది. నామీద మీకు ఏమీ ప్రేమ లేదు. ప్రేమే వుంటే, నేను వెళ్లిపోవడం మీరు సహించగలరా? లేదు...లేదు... మీకు ఏమీ అభిమానం లేదు......"

రాధకి గొప్పఆవేశం వచ్చినట్లయింది. ఆమె యీ మాటలనిన్ని, నేలమీద కూచోబడిపోయింది. శర్మ గదిలోకి వెళ్లిపోబోతూ వుండగా, రాధ మళ్లీ అంది:

"పోనీండి – మీసుఖమే నేను కోరేది. రేపుమధ్యాహ్నం బస్సులో నేను మావాళ్ల యింటికి వెళ్లి ఓ 2 నెలలపాటు వుండి వస్తాను. ఆరెండునెల్లయినా మీరు సుఖంగా వుండవచ్చు"

శర్మ మాట్లాడలేదు. రాధవైపు అట్లానే చూస్తూ, నించున్నాడు. అమె మళ్లీ అంది:–

"రేపుమధ్యాహ్నం మీరు ఆఫీసునుంచి పెందరం రాగలరా?"

"కష్టం రావడానికి వీలుపడదు"

"అయితే, ఇంటితాళాలు పొరుగింట్లో యిచ్చేస్తాను తీసుకోండి"

ఈమాటలు అంటూవుండగా, రాధగొంతుక గద్గదికమైపోయింది. ఆరాత్రి యిద్దరూ మరేమీ మాట్లాడుకోలేదు......

మర్నాడు వుదయం శర్మ ఆఫీసుకి వెళ్లేముందర భోంచేస్తూవుండగా కూడా, ఎవరూ అట్టే మాట్లాడలేదు. శర్మ భోజనంముగించి లేచాక, రాధ అట్లానే వంటింట్లో కూచుండిపోయి, గంటవరకూ ఏదో ఆలోచిస్తూన్నది. ఆతర్వాత గబుక్కున లేచి, వీధితలుపులు వేసికొని, గదిలో నేలమీద పడుకొంది.

పడుకున్నవెంటనే రాధకి ఆపుకోబడని దుఃఖం వచ్చింది. ఇన్నాళ్లయీ ఆమెలో గడ్డకట్టుకొనిపోయివున్న దుఃఖమంతా, ఈనాడు కరిగి. కన్నీటిధారల రూపంలో బయటికి వస్తున్నది. ఆమె ఎంతసేపు ఏడిచిందో ఆమెకు తెలియదు. కాని, ఈ ఒక్క సమయంలోనే, ఈ నిముషంలోనే, తన జీవితమంతా తన కళ్లయెదుట గోచరిస్తున్నది. ఎట్లా గోచరిస్తున్నదీ అంటే – అది కేవలం దుఃఖమయమనీ, కన్నీటిమయమైనదీ అనీ !

గోడగడియారం 2 గంటలు కొట్టింది. రాధ త్రుళ్లిపడిలేచింది. బస్సుకి వేళఅయినట్లుంది. తన పెట్టె సర్దుకోడానికి పక్కసామానుకొట్లోకి గబగబా వెళ్లింది. ఆమెకళ్లు ఎర్రబడి, యింకా నీళ్లతో నిండేవున్నవి.

రాధ సామానుకొట్లో ప్రవేశించినవెంటనే, అక్కడ ఆమెకు కనిపించిన దృశ్యానికి ఆమెఒడలు ఝల్లుమంది. అప్రయత్నంగా ఆమె ఒకకేక వేసి, అక్కడే నించుండిపోయింది – ఈ సందర్భంలో, ఈ సామాను కొట్టుగురించి కొంత చెప్పడం అవసరం... ఈ కొట్టు చాలా చిన్నది. సామానంతా యిందులోనే వుండడంవల్ల, కిటికీతలుపులు, వీధివేపుద్వారం, అన్నీ ఎల్లప్పుడూ మూసే వుంటవి. అంచాత కొట్లో సాధారణంగా చీకటిగానే వుంటుంది.

ఆచీకట్లో, ఒమూలని వున్న పాతపడక కుర్చీలో, ఓవ్యక్తి – శర్మ – పడుకుని వున్నాడు...రాధ కేక వేసినవెంటనే, శర్మ లేచి, ద్వారంవరకూ వచ్చాడు. అతనిముఖం కారుమేఘాలు కమ్ముకొనివున్న ఆకాశం వలె వున్నది. కళ్లలో నీటిబిందువులు నిలిచి వున్నయ్.

రాధ ఈదృశ్యానికి తట్టుకో లేకపోయింది. శర్మ ఈరూపంలో, యీస్థితిలో, విషాద మూర్తివలె యిక్కడ వున్నాడేం? అతని ముఖంలోని విషాదరేఖలను చూసినవెంటనే, రాధకి భళ్లున దుఃఖం వచ్చింది. ఆమె వెక్కివెక్కి ఏడుస్తున్నది. శర్మ ఆమెవేపు చూసి, "రాధా! ఎందుకు ఏడుస్తావ్?" అన్నాడు. ఈ బొంగురుపోయిన కంఠస్వరం శర్మది కాదు.

రాధ చప్పున అతని రెండుపాదాలమీద చేతులు వేసి "నన్ను క్షమించండి...నన్ను క్షమించండి...అభాగ్యురాలిని... నే నెక్క



భారతప్రభుత్వ ఆహారశాఖామంత్రి కె. ఎం. మున్షీ గారు క్రిందటివారం మీనంబాకం విమానాశ్రయంలో దిగినపుడు నగరప్రముఖులు మంత్రులు వారికి స్వాగతం చెప్పారు.

డికి వెళ్లను...వెళ్లలేను...మిమ్మల్ని ఈ స్థితిలో ఒదిలి నే నెక్కడికి వెళ్లలేను! నే నేం చేసినా, అంతా మీప్రేమకోసమే చేశాను. మీఅభిమానంకోసమే చేశాను. నేను మావూరు వెళతాననడం. మీ ప్రేమని పరీక్షించడానికే అన్నాను. నాకు మీప్రేమ కావాలి. మీ అభిమానంఅది లేనిదే నేను బ్రతకలేను. ఈ జీవితమంతా మీ ప్రేమమీదే ఆధారపడి వుంది. మీ ప్రేమకోసం ఏమి చేయమన్నా చేస్తాను. నా మీద మీకు ప్రేమలేదని యిన్నాళ్లు కృశించిపోతున్నాను. మీప్రేమ ఎప్పుడైనా నాకు లభించదా అనే వెర్రిఆశ మీదే యింకా నేను జీవించివున్నాను. నా జన్మ, జీవితం, సంసారం, సుఖం, అన్నీ మీ ప్రేమకోసమే, మీ ప్రేమఅంతా నాకు కావాలి. నేను మిమ్మల్ని మనసారా ఆరాధిస్తున్నాను – నేను నిజం చెప్తున్నాను. నన్ను నమ్మండి. నన్ను నమ్మండి. ఇంక నాకు కావలసినది మీ హృదయపూర్వకమైన ప్రేమమాత్రమే. ఆప్రేమకోసమే నేను జీవించివున్నాను. ఆప్రేమలేదని తెలిసినవాడే చనిపోతాను"

రాధకు గొప్ప ఆవేశం కల్గినట్లు అయింది. ఈమాటలము ఆమె అని, అయిదునిముషాలు ఆగి, మళ్లీ అంది:

"ఈస్థితిలో మిమ్మల్ని చూడలేను. చెప్పండి, మీ రెందుకో దుఃఖిస్తున్నారు. మీరు ఆఫీసుకి వెళిపోయారనుకున్నాను. కాని. వుదయంనుండి ఈ చీకట్లో పడుకొని దుఃఖిస్తున్నారు. ఎందుకో నాకు చెప్పండి"

రాధను శర్మ మెల్లిగా లేవనెత్తి, 'రాధా' అని మాత్రం అని, ఏదో చెప్పబోయి, జోటజోట కన్నీరు కార్చ నారంభించాడు. అయిదునిముషాలతర్వాత, కన్నీరు తుడుచుకుంటూ, "రాధా! అసలు యీ కల్లోలమంతా ఎందుకు వచ్చింది?" అని శర్మ అడిగి, కొంచంసేపు ఏదో ఆలోచించి, మళ్లీ అన్నాడు:

"రాధా! నువ్వు వెళ్లిపోతానంటే నేను నిజంగా సహించలేకపోయాను. నీమీద నాకు ఎంతో ప్రేమ వుంది. కాని అది పైకి కనపరచలేకపోయాను......"

అయిదునిముషాలవరకు యిద్దరూ నిశ్శబ్దంగా వూరుకొన్నారు. ఆతర్వాత, శర్మ ఆమె లేతచేతులను తన. చేతుల్లోకి తీసుకొని, ఆప్యాయంగా నిమురుతూ అన్నాడు:

"రాధా! నిజం చెప్తున్నాను. నువ్వు నా ప్రాణానివి. నిన్నింతో అధికంగా ప్రేమిస్తున్నాను......"

ఈ మాటలను అంటూ, శర్మ రాధకళ్లలోకి చూశాడు. ఆ నిర్మలమైన చూపులోనే రాధకు కావలసినదంతా వున్నది.

# గాజు తలుపులు

(24 వ పేజీ తరువాయి)

రాఘు: (నవ్వుతూ) ఏం తరింపచేయటమో లెండి, ఈ ఊళ్ళో ఉండే నాలుగు రోజులూ తరించి బైటపడితే చాలు. ఇప్పటికే నామీద ఆకాశరామన్న ఉత్తరాలు అనేకం వచ్చాయి. ఆయనెవరండి నారాయణరావుగారట డాక్టరట, ఆయన ఏవో మందులు బ్లాక్ మార్కెటు చేస్తున్నారని ఓ ఆకాశరామన్న అర్జీ వచ్చింది.

శం: ఏమిటీ నారాయణరావుగారే చేస్తున్నాడే. అరెరె ఎంత మోసపోయాం?

చెం: (ఆశ్చర్యంతో) మీకూ నారాయణరావుగారికీ పరిచయం లేదు.

రాఘు: లేదండీ, ఆయనెవరో ఇంతవరకూ చూడనేలేదు. ఇతరత్రా ఎన్క్వైర్ చేస్తే, ఈ ఊళ్ళో చీకటివ్యాపారనిర్మూలనసంఘమని మీరు పెద్దఃంతా కలిసి సంఘంగా కృషిచేస్తున్నారనీ, దానికాయనే అధ్యక్షుడనీ చెప్పారు. నిజంగా మీలాంటివారి సహకారం నాకు ఎంతైనా అవసరం ఉంది.

శంక: మేం ఎంతచేస్తే ఏం లాభమండీ. మీలాంటివారు మాకు అండగా నిలిచి సహాయం చేస్తే తప్ప, మేము చెయ్యగలిగేదేముంది. చూడండి ఊళ్ళో నల్గురూ మంచివాడంటున్నారు కదా అని ఈ ఊరికి కొత్తఅయినా కూడా ఆయన్ను ప్రెసిడెంటు చేసాం. ఈ మర్మాలన్నీ మాకేం తెలుస్తాయి? ఆయనే బ్లాక్ మార్కెట్ చేయసాగె, అరెరెరె, కంచే చేనుమేస్తే, ఇక దిక్కేమిటి? ఏమి లోకం, ఏమి లోకం.

చెం: అందుకే పైకి నీతులు చెప్తూ నిరాడంబరం అంటూ ఆడంబరం చేసేవాళ్ళని అసలు నమ్మకూడదంటారు. శంకరయ్యా మనం ఎంత గోతిలో పడిపోయాం.

శంక: ఏం చేస్తామోయ్. మనకేం తెలుస్తుంది. రాఘవయ్యగారూ మా సంఘానికి ఇల్లాంటి మచ్చరాకూడదు. మేం కూడా మా శాయశక్తులా మీకు సాయంచేస్తాం.

రాఘు: ఇంతకూ ఈ నారాయణరావుగారు ఎల్లాంటి వాడంటారు.

శంక: ఏంచెప్పగలమండీ, గోముఖవ్యాఘ్రాలూ ఉంటారు. మరి మాలాటి తెలివితక్కువ వ్యాఘ్రముఖపు గోవులూ ఉంటాయి. పైకిచూసి చెప్పటం మీలాంటి పండితులకు తెలియాలి గాని మాకేం తెలుస్తుంది.

రాఘవ: అదే అందుకనే మీరిద్దరుకూడా కాస్త నాతోవస్తే, ఇప్పుడే వారి నొకసారి కలుసుకొందాం.

చెం: కొంచెం కాఫీతాగి వెళ్దుగాని ఉందండి. ఏమేవ్ చూడుకప్పులతో కాఫీతీసుకురా.

రా: [లోపల్నించి] పంచదార లేదు, లేకపోతే

చెం: [కోపంతో] బెల్లంవేసి తీసుకురా, మాట్లాడక. అబ్బా రాఘవయ్యగారు. ఈబ్లాకు మార్కెట్టు వాళ్లతో పంచదార, బియ్యం కూడా లేక చచ్చిపోతున్నాగనండీ.

శం: చెంగయ్యా కాఫీ తెచ్చి యిద్దాం దాలోపలికి వెళ్లి. ఒక్కతే మూడుకప్పులూ ఏం తెస్తుంది.

(ఒక్కసారిగా ఇద్దరూ ఆడావుడిగా లోపలికి వెళ్తారు.)

రాఘు: ఈ శంకరం పంచెలోనుంచి ఈ నోటుబుక్కు కింద పడ్డది. చూసుకోనేలేదు. నేననుకున్నట్లు ఇద్దరూ చాలా కంగారుగా నేఉన్నారు. ఏమిటీ బ్లాకుమార్కెటు కొత్తా - భలే పేరుపెట్టాడే పుస్తకానికి. ఇంకో నోటుబుక్కుందే ఇదేమిటి, శంకరందిలాగుంది. ఇప్పుడే పనికి వస్తుంది.

—శంకరం · చెంగయ్యా లోపలికి వస్తారు.) ఇదిగోనండి కాఫీ.

రాఘు: థాంక్స్. కాఫీఅవగానే బయలుదేరదామండీ. నాకు వారియిల్లు తెలియదు. కాస్త మీరిద్దరూ రావాల.

శం. చెం: పోనీ తర్వాతవస్తే పనికిరాదూ.

రాఘు: ఏం సందేహిస్తున్నారు

శం: అబ్బే ఏంలేదు. పదండి వస్తున్నాం.

చెం: (గట్టిగా) తలుపు వేసుకోవే. (నెమ్మదిగా) పుస్తకం ఏదిరా.

శంక: హుష్ మాట్లాడకు నడు. లోపల ఎక్కడో ఉండిఉంటుందిలే.

రాఘు: (నడుస్తూ) రాండి సార్ వెడదాం.

చెం: ఏమో...

(నిష్క్రమిస్తారు) (సశేషం)

# నేటి ప్రపంచం

(7 వ పేజీ తరువాయి)

లలో సువాన్ విమానాశ్రయంలో కొన్ని దళాలుదిగాయి. కాని అవి దిగేసమయంలోనే సువాన్‌నగరంలో కమ్యూనిస్టు సైన్యాలు ప్రవేశించాయి. సువాన్ నగరంపైన విమానయుద్ధం జరిగింది. కమ్యూనిస్టు విమానాలు సువాన్ విమానాశ్రయాన్ని ధ్వంసంచేసేలోగా అమెరికన్ సైన్యాలు దక్షిణానికి చోనాన్ నగరానికిదారితీశాయి. సువాన్‌నగరం, విమానాశ్రయం 4 వ తేదీమంగళవారం నాడు కమ్యూనిస్టుల వశమయాయి. కొరియన్ రిపబ్లికన్ (దక్షిణ కొరియన్) సైన్యాలు చోనాన్‌నగరంవైపుకు పారిపోతూ మధ్యలో ఒక వంతెనను పడగొట్టారు. పడగొట్టడంలో పొరపాటు జరిగినందువల్ల, రిపబ్లికన్ సైనికులే కొన్నివందలమంది మరణించారు. మరి కొన్నివందలమంది వంతెనకు ఉత్తరాన చిక్కుపడిపోయారు. వారిలో చనిపోయిన వారు చనిపోగా మిగిలినవారు కమ్యూనిస్టుల చేత బందీలుగా చిక్కారు.

తరువాత అమెరికన్ సైన్యాలకు కమ్యూనిస్టుసైన్యాలకు సువాన్‌నగరానికి దక్షిణంగా పోరాటం జరిగింది. ఈపోరాటంలో అమెరికన్లు దెబ్బతిని దక్షిణాన చోనాన్‌నగరానికి పారిపోయారు. కమ్యూనిస్టులు వెనదరిమి వచ్చి చోనాన్ నగరాన్ని ముట్టుముట్టాయి. నగరంలో చిక్కుపడిన ఒక అమెరికన్ పటాలాన్ని అమెరికన్లు (ఆదివారం నాటికి) రక్షించలేక పోతున్నారు. నగరం కమ్యూనిస్టుల వశమయింది. టేజాన్ నగరానికి ఉత్తరాన 36 మైళ్లదూరంలో కూమ్‌నదీ తీరాన అమెరికన్లు రక్షణసన్నాహాలు చేస్తున్నారు.

సువాన్‌నగరం పతనమైనందువల్ల, అమెరికన్ ఆయుధసామగ్రి, సైనికులు దిగడానికి దక్షిణాన కోసనున్న ఫూసాన్‌నౌకాశ్రయం, విమానాశ్రయం మాత్రం వారి అధీనంలో మిగిలిఉన్నాయి. ఫూసాన్‌కు ఉత్తరంగా గల పోహాంగ్ రేవుకూడా కమ్యూనిస్టుల వశమయింది అందువల్ల అమెరికన్ సైన్యాలు, ఆయుధసామగ్రి ఫూసాన్ నుంచి 150 మైళ్లపైగా రైళ్లలో టేజాన్ నగరానికీ, అక్కడనుంచి కుమ్‌నదీతీరానికి పోవాలి. అమెరికన్‌టాంకు లిప్పుడిప్పుడే టేజాన్‌నగరానికి చేరుతున్నాయి. కాబట్టి టాంకుల సహాయంతో అమెరికన్లు కమ్యూనిస్టులతో కుమ్‌నదీతీరాన పోరాడగలరు.

కాని ఈలోగా ఈప్రధానరణరంగానికి తూర్పున కమ్యూనిస్టులు రెండు ప్రాంతాల స్థావరాలు బలపరుచుకుంటున్నారు. పయాంగ్‌చంగ్‌నుంచి వోంగ్‌జూవరకూ కొరియన్ రిపబ్లికన్ సైన్యాలతో పోరవవసరం లేకుండానే కమ్యూనిస్టులు ఆక్రమించుకున్నారు. బహుశా చుంగ్‌జూకేంద్రంపైన లక్ష్యంతో ముందుకు (దక్షిణానికి) వస్తున్నారు. సాంచోక్‌తీరంలో దిగి దానికి ఉత్తరంగాగల రిపబ్లికన్ సైన్యాలను జయించిన కమ్యూనిస్టుదళాలు, తీరంవెంట రైల్వే మార్గాన, రోడ్డుద్వారా వస్తూ యాంగ్‌డక్‌వరకూ గల ప్రాంతాన్ని ఆక్రమించుకొన్నాయి. ఈ సైన్యమూ, పోహాంగ్ రేవులో దిగిన సైన్యమూ ఏకమై పూసాన్, టేజాన్‌నగరాలమధ్య గల రైల్వే కేంద్రం ట్యోగోపైన దాడి చెయ్యడానికి యత్నిస్తున్నట్లు టోకియోవార్తలు తెలుపుతున్నాయి. టేగోనగరంలో యుద్ధం జరిగే పక్షంలో టేజాన్‌కు ఉత్తరంగా కుమ్‌నదీ తీరంలో స్థావరమేర్పరచుకుంటున్న అమెరికన్ సైన్యాలు పూసాన్ సముద్రరేవునుంచి విడగొట్టబడతాయి. అంటే ప్రధానరణరంగాన్ని సముద్రకేంద్రంనుంచి విడగొట్టడానికి కమ్యూనిస్టులు యత్నిస్తున్నారన్నమాట. కుంభవర్షాలు కురిసే ఈకాలంలో యుద్ధం జరుగుతున్నందువల్ల అమెరికన్ సైన్యాలకు, విమానాలకు చిక్కు వచ్చింది. బురదమయమైన రోడ్లలో యుద్ధానికి కొరియనులు శిక్షణ పొందారు. అమెరికన్లకు ఇది చిక్కు. అదికాక కొరియాతూర్పుతీరాన వెన్నెముకవలె వరుసగా ఉన్న పర్వతాలు కమ్యూనిస్టులకు అనుకూలంగా ఉన్నాయి. ఇంతవరకూ కొరియారేవుల్లో దిగిన కమ్యూనిస్టులకు అమెరికన్ నౌకాదిగ్బంధంవల్ల అదనపు సహాయం లభించదు. కాని ఉత్తరంనుంచి రైళ్లలో అనేకమంది సైనికులు వచ్చి పోహాంగ్ తీరసమీపంలో చేరుతున్నారు. వర్షాలవల్ల విమానాలు పనిచెయ్యలేని ఈతరుణంలో కుమ్‌నదీతీరంలోనూ పోహాంగ్ సమీపంలోనూ పెద్దపెట్టున యుద్ధాలకు ఇరుపక్షాలూ సన్నద్ధమౌతున్నాయి.

(సూర్యనారాయణ)

# మనదేశం

(8వ పేజీ తరువాయి)

బడి తెచ్చుకోక తప్పదని ఇప్పుడు సోషలిస్టు లంటున్నారు. ప్రధాన పరిశ్రమల నిమిత్తం కాకపోతే అమెరికన్లు మనదేశంలో పెట్టుబడి పెట్టనే పెట్టరనే విషయాన్ని వీరు గ్రహించలేనట్లుంది. ఇదివరలో విదేశీయుల పెట్టుబడికి తావివ్వగలరని ప్రకటించినందుకు కాంగ్రెస్ ప్రభుత్వాన్ని వీరువిమర్శించారు.

ఉద్యమవిధానంలో తీవ్రమైన భేదాభిప్రాయాలు కలిగాయి. రాజకీయ ఆర్థికవిప్లవాలను సాంఘికవిప్లవాంద్వారానూ, పరిపాలనాధికారాన్ని ఆర్జించడంవల్లనూ సాధించాలని ఇప్పుడంటున్నారు. ఇంతలో రాజకీయవిప్లవం సాధిస్తేగాని, ఆర్థికసాంఘిక విప్లవాలను సాధించడం అసాధ్యమని చెప్పేవారు. ఇప్పుడది పోయింది. పార్లమెంటరీ విధానం, ఎన్నికల విధానాల ఆధారంతో పరిపాలనాధికారం సాధించగలిగినట్లయితే తాము కోరిన ఆర్థికవ్యవస్థ, సమాజ వ్యవస్థ నిర్మించవచ్చునని వీరిప్పుడు అభిప్రాయపడుతున్నారు. అందువలనే సోషలిస్టులకు ఆశయాల ప్రచారాలకంటె అధికారార్జన ప్రధానమయింది. అందువల్లనే ఉత్తరప్రదేశంలో జమీందారు లేర్పరచిన డెమోక్రటిక్ పార్టీతోకూడా సఖ్యతకు కొందరు సోషలిస్టులు సిద్ధపడగలుగుతున్నారు. ఈ హేతువువల్లనే అచ్యుత పట్వర్ధన్‌వంటి నాయకులుపార్టీని విడిచిపెట్టారు. ఆశయాల్ని ఆదర్శాల్ని కూడా మరిచి కేవలం అధికారసముపార్జనకోసమే యత్నించినట్లయితే, ఈనాడు కాంగ్రెస్ ఏస్థితిలో ఉందో, అధికారం రాకముందే సోషలిస్టుపార్టీ ఆస్థితిలోకి రావచ్చును. సమాజన్యాయయవానికి సమ్మతించనివారు పార్టీలో ప్రాబల్యం ఆర్జించి సోషలిస్టుపార్టీద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకోగల ప్రమాదం ఉంది. అప్పుడు సోషలిస్టుపార్టీ పేరుకే సోషలిస్టు పార్టీగా మిగిలి కాంగ్రెస్‌కి అపరావతారంగా మారుతుంది. జయప్రకాశనారాయణ నాయకత్వంలో ఉండగా అంతప్రమాదం సంభవించదనుకోవడం పొరపాటు. పండిట్ నెహ్రూ నాయకత్వంకూడా కాంగ్రెస్ స్వరూపాన్ని ఈనాడు మార్చలేక పోతోంది. ఈ ముప్పుని గుర్తించనినాడు సోషలిస్టుపార్టీ 18 అంశాల కార్యక్రమం కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమంతోవనే నెడుతుంది. (సీతారామ్)

# ఇండోచైనా అటవికజాతి మోయ్‌లు

(16-వ పేజీ తరువాయి)

ఉత్సవసమయాల్లో నాట్యపు వేళలలో వారు ఆవాద్యవిశేషమును ఉపయోగిస్తూఉంటారు.

## వేట

మోయ్‌జాతివారు వేటాడుటలో చాల నేర్పు కలవారు. వేటలో మృగములను చంపక సజీవముగనే పట్టుకొనుచుందురు. బాణముల నుపయోగింపరు. ఏమంటే వారి బాణములు విషలిప్తములై ఉంటాయి. కాగా చంపబడిన జంతువు తినుటకు ఉపయోగపడదు. కొన్ని చెట్లరసములను, కొన్ని మూలికలను ఉపయోగించి వారు ఘోరమగు విషమును తయారు చేస్తారు. ఆ ప్రక్రియను వారు అతిగోప్యంగా ఉంచుతారు.

వేటలో ఓ విశేష మేమిటంటే మోయ్‌జాతివారెవరుకూడ పులిని వేటాడరు. అది వారికి భగవంతునితో సమానము. పులిని పెద్దలేక యజమాని అని పిలుస్తారు. చనిపోయిన పులిని సమాధిచేస్తారు. దాని జ్ఞాపకార్థంగా శిల నొకదాన్ని పాతి పూజిస్తూఉంటారు.

## పెండ్లి ఆచారము

మోయ్‌ల సాంఘికజీవితములో మనకు కొన్ని వింతగా కనపించుతాయి. వయసు వచ్చిన మోయ్‌జాతియువకులు ఇండ్లలో ఉండక వారికై ప్రత్యేకింపబడ్డ ఇండ్లలో నివసిస్తారు. స్త్రీ అంగీకరించినచో వివాహము లేకపోయినను పురుషులు వారితో సంసారము చేయవచ్చును. అవివాహితలగు వారు చాలమంది బిడ్డలను కని ఉండుట వారిలో పరిపాటికూడ. ఒకడు ఒకదానిని ప్రేమించిన అతడు ఆమెముఖముపై గోళ్లతో రక్కును. అది అతని ప్రేమను తెలుపుడు చేయువిధానము. అందుల కామె అంగీకరించినచో ఆవిషయమును వారు గ్రామపెద్దలకు తెలుపవలెను. పిదప వరుడు పిల్లయింటికి వెళ్లి పిల్లతండ్రికి సహాయముగ పనిపాటలు చేయుచుండును. అతడు కుటుంబభారమునువహింపగలడనుటను తెలిసికొనుట కిదిదారి. ఆసమయమున అతడు వధువుస్వభావమును చక్కగ తెలిసికొనును. వివాహమున కంగీకరింపకపోయినచో అతడు పిల్లతండ్రికికొంత రొక్కమును ఇచ్చుకొనవలయును. నగదైనచో ఏడు రూపాయలు .చాలును. కాని వారిలో ధన పుటవసరము లేదుకావున తరుచుగ ఆ ఏడు రూపాయలకు బదులుగ ఒక దున్న, రెండు మేకలు ఇచ్చుకోవలెను:

వివాహమునకు ముందు స్త్రీ స్వతంత్రురాలై యుండవలెను. ఇందువలననే చాల మందికి బిడ్డలు కనినతరువాతకూడ వివాహముజరుగుట కద్దు.

## సాంప్రదాయాలు

మోయ్‌ల ప్రేతకర్మలు నిరాడంబరముగ జరుగును. శవమును కొయ్యపెట్టెలో ఉంచుట వారి మామూలు. వారి ఆచార వ్యవహారములు చాల విచిత్రముగ నుండును. ఆ సంప్రదాయములు మిక్కిలి కట్టుదిట్టముగ కూడ అమలుజరుపబడుచుండును. స్త్రీని ఎవరైనబలవంతముగ చెరచినచో ఆమె వెంటనే కులపెద్దలకడ ఫిర్యాదు చేయును. వారు ఆ నేరమును చక్కగా విచారించి యోగ్యరీతిగ అతన్ని దండిస్తారు. వారిలో ఇష్టములేనిచో స్త్రీని తాకడముకూడ చాల తప్పు. దోషికి దండనముతోకూడ జరిమానాకూడ విధింపబడుతుంది. ఆతడు మేకలుగాని, ఆవులుగాని, జరిమానాకు మారుగా ఇచ్చుకోవాలి. అది కాకఏస్త్రీని చెరచాడో ఆస్త్రీని అతడుతప్పక వివాహము చేసికొనితీరాలికూడ. అందుకు అతడు అంగీకరించకపోతే అతడికి విధించబడేశిక్ష ఇంకా తీవ్రంగా వుంటుంది.

మోయ్‌జనాభాలో స్త్రీల సంఖ్య చాల తక్కువ. కాబట్టే వారిలో ఒకడు ఒక స్త్రీనే వివాహ మాడడము విధిగా అమలులో వుంది.

ఒక విచిత్రమేమంటే ఒకని భార్య పరునితో వ్యభిచరించినచో ఆ దోషము ఆమెది కాదు. ఆ తప్పు భర్తది అని వారె నిర్ణయిస్తారు. ఏమంటే అతని అజాగ్రత్తేకదా అందుకు కారణము అని వారంటారు.

## నృత్తకళ

మోయ్‌జాతివారికి మంత్రతంత్రములన్నా దెయ్యాలన్నా, పిశాచాలన్నా, జంతువులన్నా చాల విశ్వాసము. మనము వానరములను మనకు మూలకములన్నట్లుగానే వారు కుక్క వారి జన్మకు మూలమని అంటారు. కాబట్టే వారు కుక్కను చాల శ్రద్ధతో పూజచేస్తారు. కప్పలుపైన కూడ వారికి అపారమయిన భక్తి ఉంది. కప్పలు అరవడముమూలముగానే వానలు కురుస్తాయని వారి విశ్వాసము. మోయ్‌జాతివారు నీటిని, అగ్నినికూడ పూజిస్తారు.

మోయ్‌జాతివారు శరీరమునం దప్పుడప్పుడు పచ్చ పొడిపించుకొనుచుందురు. ఉత్సవదినములందును వెన్నెలరాత్రులలో ఆబాలగోపాలము గుమిగూడి నృత్యముచేయుదురు, యుద్ధనృత్యములను సంతోషసమయములందును, ప్రేతనృత్యము అశుభసమయములందును చేయుచుందురు. నృత్యసమయములందు ఒకవిధమయిన బియ్యపు సారాయిని త్రాగి నాట్యమున కుపక్రమిస్తారు. మొదట ఒక పెద్ద జాడీనిండ సారాయి తెచ్చిపెట్తారు. తలా ఒక వెదురుగొట్టముతో, దానిని పీల్చుకొనుచు త్రాగుతారు. తరువాత తాళములు తప్పెటలు వాయించుచు జాడీచుట్టును తిరిగి నాట్యము చేయుచుందురు. అప్పటి వారి ఉత్సాహమే ఉత్సాహము. ఫ్రెంచివారు మోయ్‌జాతివారిని ఆదరించి తమవలె నాగరికులనుగా తయారు చేయుటకు చాల యత్నించారు కాని వారి యత్నములు నిష్ఫలము లయ్యాయి.

ఇండోచీనాలో తక్కిన జాతులన్నీ చాల ముందుకు వచ్చాయి. కాని వారు మాత్రము చీకూ చింతా లేకుండ ఎప్పట్లానే కాలము గడుపుతూఉన్నారు.

(మోడరన్‌రివ్యూ ఆధారంగా.)

# గుడివాడ కాలేజీ ప్రారంభం



ఈ నెల 6 తేదిన గుడివాడ కళాశాలను వి. యస్. కృష్ణగారు ప్రారంభోత్సవము జరిపిరి. అధ్యక్షత వహించిన గా॥ గోపాలరెడ్డిగారు ఉపన్యసించుచున్న దృశ్యం.




గా. గోపాలరెడ్డిగారి రాకకు సభా ప్రారంభోత్సవమునకు సభికులు ఎదురుచూచుచున్న దృశ్యం.



సభా ప్రారంభమున స్థానిక మునిసిపల్ విద్యార్థినులు ప్రార్థన చేయుచున్న దృశ్యం.



గా. గోపాలరెడ్డి, కృష్ణా, కాజ వెంకట్రామయ్యగార్లు మాట్లాడుకుంటున్న దృశ్యం.

